## మహాకాలుని ప్రేరణ - అతి ముఖ్య సూచన

క్రాంతి ధర్మీ సాహిత్యము అనే పేరుతో ప్రసిద్ధి గాంచిన ఈ పుస్తకమాల క్రాంతిదర్శీ ప్రజ్ఞాపురుషుడు పండిత శ్రీరామశర్మఆచార్య గారిద్వారా 1989 నుండి 1990 మధ్య కాలములో తమ మహాప్రయాణమునకు ఒక సంవత్సరము ముందు ఒక ప్రవాహముగా సృజించబడినవి. ఇరవై చిన్న చిన్న పుస్తకములుగా వున్న ఈ సాహిత్యము గురించి మన ఆరాధ్య పరమపూజ్య గురుదేవులు (పండిత శ్రీరామశర్మఆచార్యగారు) ఇలా వివరించారు - " ఇవి నా విచారక్రాంతి యొక్క బీజములు. ఇవి కొద్దిగా అయినా సరే విస్తరింపబడితే మనుష్యులను కుదిపివేస్తాయి. సంపూర్ణ విశ్వము యొక్క పటము (MAP) నే మార్చివేస్తాయి". నిజానికి ఈ పుస్తకములలో కేవలము ఆలోచనలే కాదు ఒక మహాక్రాంతి యొక్క జ్వాల లేక మంట వున్నది. యుగపరివర్తన దిశ నిర్ధారింపబడింది.

యుగఋషి తమ జీవితమంతా, జీవించే కళ నుండి నిగూఢ ఆధ్యాత్మిక విషయములు మరియు సమాజనిర్మాణము నుండి వైజ్ఞానిక-ఆధ్యాత్మిక ప్రధానమైన సమగ్ర సాహిత్యము ఏదయితే రాస్తూ వచ్చారో దానిని మొత్తము త్రాసులో ఒక తక్కెడలో పెట్టి రెండవ వైపు సూత్రప్రాయముగా వ్రాయబడిన ఈ పుస్తకములను పెడితే వీని బరువే ఎక్కువ. ఈ అమూల్య సాహిత్యాన్ని ఎవరైనా లాభమువద్దు, నష్టమువద్దు (NO PROFIT-NO LOSS) పద్ధతిన అచ్చుగుద్ది వ్యక్తివ్యక్తికీ అందచేయమనే నిర్దేశము గాయత్రీపరివార్ యొక్క అధిష్ఠాత పరమపూజ్య గురుదేవులు స్వయముగా ఇచ్చారు. వీటిని ఎవరైనా ప్రచురణ చేయవచ్చు, ఎవరికైనా పంచవచ్చు. వీటిని ఎంత ఎక్కువమంది వ్యక్తులకు ఏ పాఠకుడు, పరిజనుడు అందచేయగలడో అతను అంత ఎక్కువ పుణ్యాన్ని పొందగలడు.

*Global Head Quarters :* **GAYATRI TEERTH**
*Shanntikunj, Haridwar, Pin- 249411*
*Phones: (0133)2460866, 2461955, 2460309*
*Phones: (0133) 2460866 E-mail : shail@del2vsnl.net.in*
*website : www.gayatripariwar.org, www.awgp.org*

మహాపూర్ణాహుతి పుస్తకమాల - 1

# 21వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 1

ప్రథమ భాగము



పండిత శ్రీరామశర్మ ఆచార్య

**నలుదిక్కులా మధురమైన, స్వచ్ఛమైన, నిరాడంబరమైన సహృదయ వాతావరణాన్ని నిర్మిస్తాను**

మహాపూర్ణాహుతి పుస్తకమాల - 1

# 21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 1

**ప్రథమ భాగము**


హిందీ మూలరచన :

వేదమూర్తి, తపోనిష్ఠ, యుగద్రష్ఠ

**పండిత శ్రీరామశర్మఆచార్య**

అనువాదము :

**డా॥ మారెళ్ళ శ్రీరామకృష్ణ**

ఎమ్.ఎస్సి, పిహెచ్.డి.



ముద్రణ

**గాయత్రి చేతనా కేంద్రము**

అశ్విని హౌస్ దగ్గర, హెచ్.పి.రోడ్, మూసాపేట్,

హైదరాబాద్-500018.

ఫోన్స్ : 040-23700722, 32986922, 09392506888

E-mail : hyderabad.ap.in@awgp.org, info@aswini.com

విషయసూచిక



ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్.

# 21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 1

## భూమిక

గత కొద్ది సంవత్సరాలుగా భౌతికవాదము మరియు వైజ్ఞానిక క్షేత్రాలలోని అసాధారణ ప్రగతి అనేక సుఖసాధనాలను, సంపత్తిని అందజేసింది. వీటిని పెంపొందించడానికి చూపించిన ఉత్సాహము వలన వీటిని అవాంఛనీయరీతులలో వుపయోగించడము జరిగింది. తద్వారా ఏర్పడిన విపత్కర పరిస్థితులనుండి బయటపడే మార్గము కనుక్కోలేకపోతే సర్వనాశనము తప్పదు.

ఈ సృష్టికి ఒక నియంత వున్నాడు. ఆయన తన సమస్త కౌశలమును ఉపయోగించి ఈ పృథ్విని మరియు దానిని చక్కగా తీర్చిదిద్దటానికి మనిషిని తయారుజేశాడు.

ఆయన ఈ సంరచన నాశన మౌతూవుంటే చూస్తూ ఊరుకోలేడు. ఆ నియంత ఈనాటి పరిస్థితులను చూసి సర్వనాశనము కాకుండా మఱల సంతులన ఏర్పరచటానికి సమయానుకూల నిర్ణయము తీసుకున్నాడు.

**1989 నుండి 2000 సంవత్సరము వరకు యుగసంధి కాలముగా గుర్తించబడింది.** భవిష్యవేత్తలు, దివ్యదృష్టి గలవారందరు దీనిని అంగీకరిస్తున్నారు.

ఈ అవధిలో ఆలోచనాశక్తి గలిగిన, భావసంవేదనలు కలిగిన, ప్రతిభావంతు లందరూ అతి అరుదుగా లభించే ఈ గొప్ప అవకాశమును ఉపయోగించుకొనుటకు తయారై పూర్తి తత్పరతతో తమతమ వంతు క్రియాకలాపాలు చేయుటకు ముందుకు వచ్చి శ్రేయో సౌభాగ్యములు పొందగలరు.

- - - - - - -





## 1. అయోమయం ( కింకర్తవ్య విమూఢత ) లో పడవేస్తున్న పరిస్థితులు

20వ శతాబ్దములో విజ్ఞానము (science), భౌతికవాదము (బుద్ధివాదము-materialism) పరాకాష్ఠకు చేరుకున్నాయి. వీటివలన సుఖసాధనములకు క్రొత్త ద్వారములు తెరుచుకోవడమేకాక, భౌతిక పరిస్థితులను అర్థము చేసికొని, వాటిని ఉపయోగించుకునే బుద్ధికూడా వికసించింది. కానీ వీటి దురుపయోగము వలన ఈ యుగపు పై రెండు చమత్కారములు లాభము కలుగజేయుటకు బదులు క్రొత్తక్రొత్త ప్రమాదాలను, సమస్యలను, విపత్తులను తెచ్చిపెడుతున్నాయి. తయారుచేసిన సామాగ్రిని(ఉత్పాదనలను) అమ్మి సొమ్ముచేసుకొనుటకు ఆర్థికవలనవాదపరంపర పుత్పన్నమైనది. యుద్ధములు ప్రోత్సహింపబడ్డాయి. ఎందువల్లనంటే ఎక్కువగా తయారైన ఉత్పాదనలు అందులో ఖర్చవుతాయికదా! పెద్దపెద్ద పరిశ్రమలు నిర్మించబడ్డాయి. అందువల్ల కుటీరపరిశ్రమలపై ఆధారపడి జీవించేవారు నష్టపోయారు. పని లభించక నేడు అనేకమంది అతిపెద్ద సంఖ్యలో నిరుద్యోగులుగా వున్నారు. పరిస్థితులు రోజురోజుకు దారిద్ర్యరేఖ కంటే క్రిందికి దిగజారుతున్నాయి. కొంతమంది వద్ద ధనము ఏకత్రితమౌతోంది!

వాహనములు, కర్మాగారాల వలన నిరంతరము వెదజల్లబడే విషవాయువులు వాయుమండలమును విషపూరితము

చేస్తున్నాయి. వాటిలో ఉపయోగించబడే ఖనిజాలు, ఇంధనాలు ఎంత వేగంగా మండించబడుతున్నాయంటే; ప్రపంచములోని ఖనిజభాండారము ఇంకొక 100 సంవత్సరాలవరకు ఉంటుందా? ఉండదా? అనే అనుమానాలు వ్యక్తమౌతున్నాయి. ధాతురసాయనిక సంపదలు, పృథ్వినుండి త్రవ్వి వెలికితీయుట వలన ఆ సంపదలకొఱత ఏర్పడుతోంది. దీనివలన పృథ్వియొక్క ఒక మహత్వపూర్ణ సామర్థ్యము తగ్గి పృథ్వియొక్క ఉత్పాదనలపై ఆధారపడే అనేక ప్రాణులపై దుష్ప్రభావము పడుతున్నది. పెరుగుతున్న పట్టణాల, కర్మాగారాల యొక్క వ్యర్థపదార్థములు జలాశయాలలో కలవడంవలన ఆ నీరు త్రాగటానికి ఉపయోగపడటంలేదు. గాలి పీల్చుకుంటున్నప్పుడు, నీరు త్రాగుతున్నప్పుడు శరీరములోకి మందవిషములు (స్లోపాయిజన్) ప్రవేశిస్తున్నాయా అనే భయము నిరంతరము ఉంటుంది. పరిశ్రమలు, వాహనాల ద్వారా విడుదల అవుతున్న ప్రదూషణం గ్రీన్‌హౌస్ ఎఫెక్ట్ (greenhouse effect) వలన అంతరిక్షంలో ఉష్ణోగ్రత పెరుగుతున్నది. దీనివల్ల మంచుప్రాంతాలలోని మంచు కరిగి సముద్రమట్టము పెరిగి, భయంకర ప్రమాదములొచ్చే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. వాతావరణంలోని విషపూరిత వాయువుల వలన బ్రహ్మాండకిరణములనుండి పృథ్విని కవచము వలె రక్షించే ఓజోన్‌పొర చిరిగిపోతున్నది. ఇదేక్రమము కొనసాగితే, ఏ సూర్యకిరణమువలన పృథ్వీమీద జీవనవికాసక్రమము అభివృద్ధి చెందిందో, ఆ సూర్యకిరణములే, రక్షణ పొర



లేకపోవడంవలన అత్యధికముగా పృథ్వీమీద చేరి వినాశనముకూడ సంభవించవచ్చు.

క్రొత్తగా అణుశక్తి వృద్ధిచెందడంవలన ప్రమాదకరమైన వికిరణములు వాతావరణంలో వ్యాపించుటయేగాక తద్వారా ఏర్పడిన 'బూడిద'ను ఎక్కడ విసర్జించాలి? అనే ప్రశ్న ఉత్పన్నమౌతున్నది. ఎందువల్లనంటే ఇది ఎక్కడుంటే అక్కడ ప్రమాదకర పరిస్థితులను ఏర్పరుస్తుంది.

## 2. ఖచ్చితంగా పరిస్థితులు విస్ఫోటకరమైనవే

వైజ్ఞానిక సమృద్ధి, దాని దురుపయోగంయొక్క కథ ఇది. ఇందులో సుఖప్రదమైన అంశములు తక్కువగాను, దుఃఖప్రదమైన అంశములు ఎక్కువగాను ఉన్నాయి. ఈ క్రమము ఇంకా కొనసాగుతూనేవున్నది. నిజము చెప్పాలంటే రోజురోజుకు ఎక్కువగా విస్తరిస్తున్నది. ఇప్పటివరకు జరిగిన నష్టములను, తద్వారా ఏర్పడిన సమస్యలను ఎలా సవరించుకోవాలో తెలియడంలేదు. రాబోయేరోజులలో ఇవి ఇంకా చాలా ఎక్కువ వృద్ధి చెందినప్పుడు ఎటువంటి దుర్గతి ఏర్పడుతుందోకదా? కొలదికాలంలో అభివృద్ధి చెందిన ఈ వైజ్ఞానిక దురుపయోగము వలన ఏర్పడిన పరిస్థితులను చూస్తే రాబోయే రోజులలో చాలా సహజంగానే ఇంకా వైజ్ఞానిక అభివృద్ధి వలన కలిగే అనర్థముల గురించి అంచనా వేయవచ్చును.

వైజ్ఞానిక ఆలోచనా సరళి (దర్శనము) ప్రత్యక్షవాదము మీద

ఆధారపడి వుంటుంది. ఇది తత్త్వదర్శనము (Philosophy)ను కూడ ప్రభావితము చేసింది. దీన్నిబట్టి భౌతికంగా, ప్రత్యక్షంగా వున్నదానికే విలువ ఇవ్వబడుతున్నది. ప్రత్యక్షముగా పొందే లాభానికే ప్రాముఖ్యము ఇవ్వబడుతున్నది. పరోక్షముయొక్క అంకుశమును స్వీకరించనప్పుడు ఈశ్వరుడు, ధర్మము మరియు దానితోపాటు కలిసివుండే సంయమ, సదాచార, పుణ్య - పరమార్థములకు విలువ ఉండదు. పాటించవల్సినవాటిని మరియు పాటించకూడనివాటిని అంధవిశ్వాసములు అని చెప్పి వాటిని వదిలివేయమని ఎందుకు నొక్కిచెప్పారంటే ఇవి వ్యక్తియొక్క స్వసుఖానికి అడ్డుతగులుతాయి కనుక. పూర్తిగా అనుభవించాలి అనే సిద్ధాంతము ఏమి చెబుతుందంటే - ఎంత ఎక్కువ లాభము పొందగలిగితే అంత పొందటానికి ప్రయత్నించాలి. దీనికొరకు ఏ ఆదర్శములను, సిద్ధాంతములను అడ్డురానివ్వకూడదు. సంపూర్ణసుఖము అనుభవించడానికి, వీలైనంత ఎక్కువ లాభము పొందటానికి ఏ ఆదర్శాలను, సిద్ధాంతాలను పాటించవల్సిన అవసరములేదు అనేదే యీ ప్రత్యక్షవాదముయొక్క సిద్ధాంతము. ఈ ఆలోచనాసరళియే పశుపక్షుల వధను ఒక సహజమైనప్రక్రియగా ప్రోత్సహిస్తున్నది. అన్యప్రాణుల మీద చూపే ఈవిధమైన నిర్దయతవలన తెగిన ఆనకట్ట తోటి మనుష్యులమీదకూడ అదే ప్రభావమును చూపించకుండా ఉండటానికి ఏ ఆధారము ఉంచదు. పశుప్రవృత్తులు మనిషికి సహజము అని నిర్ణయించుకున్నప్పుడు,



యౌవనస్వేచ్ఛాచారము (sexual fereedom) కూడదు అని అనలేము.

విజ్ఞానము, భౌతికవాదము యొక్క క్రొత్తక్రొత్త పోకడలు వాటి ఆధారముమీద తాత్కాలిక లాభముల యొక్క ఇంద్రజాల చమత్కారములను అందజేసే నేటి ఆధునికత, నీతి మరియు సదాచారములను పూర్తిగా చెరిపివేస్తూ వ్యక్తిని స్వేచ్ఛాచారిగా మార్చుచున్నది.

## 3. పెరుగుతున్న జనసంఖ్య - పెరుగుతున్న సమస్యలు

కాముకత ప్రాకృతిక మనోల్లాసము కలుగజేసేదిగా మాత్రమే గుర్తించడము వలన దానిని విచ్చలవిడిగా ఇష్టానుసారము ఆచరించవచ్చు అనే భావన ఏర్పడుతున్నది. దీనివలన పెరుగుతున్న జననంఖ్య అనే నమన్య ఏర్పడింది. గర్భనిరోధములకు, భ్రూణహత్యలకు ప్రోత్సాహము లభించినా, జనసంఖ్య ఇంకా వేగంగా పెరుగుతూనేవున్నది. సంపూర్ణపృథ్వీమీద చక్రవడ్డీవలె జనసంఖ్య వృద్ధి అవుతున్నది. ఒకటినుండి నాలుగు, నాలుగు నుండి పదహారు, పదహారునుండి అరవైనాలుగు ఇలా ఈ సంఖ్య ఎంతకు పోతుందో ఊహించలేము. 3,000 సంవత్సరాల క్రిందట కేవలము 30 కోట్ల మంది వ్యక్తులుండే ప్రపంచ జనాభా ఇప్పుడు 1000 కోట్లకు చేరుకున్నది. రాబోయే 20 సంవత్సరాలలో ఈ సంఖ్య రెట్టింపై ఆహారము, నివాసముల సమస్యే కాక, చివరకు రహదారిమీద నడవడమే కష్టము కావచ్చు.

పృథ్వికి సీమితసంఖ్యలోని ప్రాణులకు మాత్రమే పోషణ నివ్వగలిగే సామర్థ్యము ఉన్నది. ఇది అసంఖ్యాక ప్రాణులకు పోషణ నివ్వలేదు. పెరుగుతున్న జనసముదాయము అప్పుడే అనేక సమస్యలను కలుగజేస్తోంది. ఆహార ఉత్పాదనకు భూమి సరిపోవడంలేదు. నివసించడానికి అనేక అంతస్థుల భవంతులు తయారుజేయవల్సివస్తున్నది. ఖాద్యాన్నముల ఉత్పత్తియేగాక, ఇతర అనేక కార్యములకు భూమి చాలా ఎక్కువ పరిమాణంలో కావల్సివస్తున్నది. అడవులను కొట్టివేయవల్సివస్తున్నది. అడవులను సంరక్షించటానికి న్యాయసంబంధ రక్షణ వున్నా భూమియొక్క అవసరము వాటిని ఏదోవిధంగా ఉల్లంఘించేటట్లు చేస్తున్నది. తద్వారా వాయుప్రదూషణ నివారించగలిగే పరిస్థితులు తగ్గుతున్నాయి. భూమిలో చెట్టు వేళ్ళయొక్క పట్టుసడలడము వలన వరద వచ్చినప్పుడల్లా భూమికోత జరిగి ఎడారులు ఏర్పడుతున్నాయి. నదులయొక్క లోతు తగ్గడంవలన జలసమస్య ఏర్పడుతోంది. గృహోపకరణములు, ఇల్లు మరియు ఇంధనముల కొరకుకూడ కట్టెలు లభించటంలేదు. చెట్లను నరికివేయడంవలన వచ్చే అనేక ప్రమాదాలు తెలిసినా నివానము కొరకు, ఖాద్యాన్నముకొరకు, రహదారుల, పాఠశాలల, ఆనకట్టల నిర్మాణముకొరకు భూమి కావాలి. ఇవన్నీ జనసంఖ్య పెరుగుదల యొక్క దుష్పరిణామములే. వీటితోపాటు ఇంకో అనర్థముకూడా కలుస్తున్నది. పెరుగుతున్న పట్టణాలు, వాటిలో పెరుగుతున్న జనసంఖ్య దానిద్వారా పెరుగుతున్న చెత్త, మురికివలన నగరంయొక్క వాతావరణము నరకతుల్యమౌతున్నది.



## 4. అన్నివైపులా అశాంతి, ఉద్విగ్నత, వ్యాధులు

కోలాహలము, ప్రదూషణ, మురికి, రోగాలు మొదలగు విపత్తులతో వ్యక్తి రోజురోజుకు తన జీవనీశక్తిని కోల్పోతున్నాడు. శారీరక, మానసిక వ్యాధులు అతనిని పీల్చిపిప్పిజేస్తున్నాయి.

బలహీనతలవలన ఉత్పత్తి అయిన అందవికారములను దాచుకొనుటకు పైపై మెఱుగులు దిద్దుకొనుటయే ఏకైక మార్గమని భావిస్తున్నాడు. శారీరక, మానసిక వికృతులను దాచుకొనుటకు, పెరుగుతున్న శృంగార సాధనాలయొక్క తుఫాను మనిషిని విలాసవంతునిగాను, బద్ధకస్తునిగాను, అపవ్యయము చేసేవాడిగాను, అహంకారిగాను మార్చి ఒక వినూత్న సమస్యను సృష్టిస్తున్నది.

పైపై మెఱుగుల ఆవరణములను తొలగించి చూడగలిగితే ఇన్ని శతాబ్దములలో మనిషి పొందినదానికంటే చాలా ఎక్కువ పోగొట్టుకున్నాడు అని తెలుస్తున్నది. సౌకర్యాలు నిస్సందేహంగా పెరిగాయి, పెరుగుతున్నాయి.

**కానీ వీటికి బదులుగా జీవనీశక్తి నుంచి వినమ్రత, సజ్జనత మొదలగు మానవీయ విలువల వరకు అన్ని 'అపహరణ'కు గురై క్షీణిస్తునాయి.**

నేడు మానవుడు ఒక **'శ్మశానస్తబ్ధత'** మధ్య భయపడుతు, ఇతరులను భయపెడుతు, ప్రేత పిశాచాల వలె జీవిస్తున్నాడు.

ఈనాడు ప్రతిఒక్కరు సమృద్ధిని పెంచుకోవడానికి

వ్యాకులపడుతున్నారు. కానీ దానికొరకు యోగ్యత, ప్రామాణికత, పురుషార్థపరాయణత అవసరమౌతాయి. అయితే అవి లేకుండా ఉత్తినే ఇంటిదగ్గర కూర్చుని తొందరతొందరగా ఏవేవో పొందాలని అనుకుంటారు. అటువంటప్పుడు అనాచారము తప్ప ఇంకొక మార్గమే కనిపించదు.

ఈరోజుల్లో ప్రగతి పేరుమీద ధనవంతులవ్వాలనే కోరిక ఆకాశము నంటుతోంది. దీని పరిణామముగా తృష్ణకూడ ఆకాశము నంటుతోంది.

ఇటువంటి మానసికస్థితియొక్క పరిణతి ఒక్కటే - మనిషి అనేకానేక దుర్గుణాల ఉచ్చులో చిక్కుకుంటాడు. పరస్పర విశ్వాస, స్నేహ, సద్భావములు పోగొట్టుకోవడంవలన వ్యక్తి నవ్వుతూ, నవ్విస్తూ సద్భావన, సహయోగములతో కూడిన జీవితమును జీవించగలడు అనేది సందేహాస్పదమే.

నేటి పరిస్థితులను రెండు రకాలుగా అర్థము చేసుకోవచ్చు.

1. అస్తవ్యస్థత మరియు దిశారహిత పరిస్థితులనుండి బయటపడి ప్రగతిశీల సాధనాసామాగ్రిమీద పట్టు అధికంగా సంపాదించుకొన్నాడు లేదా

2. లభించిన సాధనాసామగ్రుల పేరు మీద వృద్ధిచెందిన అతివుత్సాహము, అహంకారముగా మారి జీవితముయొక్క శాశ్వత విలువలను తిరస్కరించింది. రెండింటిలో ఏది కారణమైనా అది చింతాజనకమే.



## 5. వాస్తవికత - దానిని అధిగమించడ మెలా?

సమస్త విశ్వములోని సగంమంది ప్రతిభాశీలురు యుద్ధంకొరకు అవసరమయ్యే అనేక పనులలో ఏదోరకంగా నిమగ్నమైయున్నారు. పెట్టుబడులు మరియు పెద్దపెద్ద భవనములు ఈ ప్రయోజనంకోసమే ఉపయోగించబడుతున్నాయి. పెద్దల ఆలోచన మరియు వారి సామర్థ్యములు దీనిగురించి రకరకాలుగా ఆలోచించడంలోనే నియోగించబడుతున్నాయి. ఈవిధమైన సంపూర్ణతంత్రముయొక్క ఉపయోగము యుద్ధము కొరకే వినియోగించబడితే పరమాణు ఆయుధాలు పృథ్వియొక్క మహావినాశనమునకు ఖచ్చితంగా కారణమౌతాయి. అప్పుడు పృథ్వీమీద జీవనము అనేదే మిగలదు. ఒకవేళ యుద్ధము జరుగకపోతే ఇంకొక ప్రమాదము పొంచియుంటుంది. అదేమిటంటే తయారుజేసిన యుద్ధసామగ్రిని ఏమి చేయాలి? ఆ ప్రయోజనముకొరకు ఉపయోగించబడిన **జనశక్తి, ధనశక్తి మరియు సాధనాశక్తి**ని ఒక క్రొత్త విధానమును అవలంబించి, ఈనాడు అసంభవమనిపించే **నూతనదిశ** ఇవ్వడము కొరకు ఏమి చేయాలి?

నేటి పరిస్థితులలో అన్నింటికంటే భయంకరమైనది వక్రబుద్ధి, సంకీర్ణ స్వార్థచింతనతో నిండిన మనస్సు, బద్ధకముతో కూడిన విలాసవంతమైన అనాచారీ స్వభావము. బయటకు దేవతల, సాధువుల ముసుగువేసుకుని తిరుగుతున్నప్పటికి మనిషి ప్రేతపిశాచస్థాయికి దిగజారాడు. నేటి జనసముదాయము శారీరక

దృష్టితో చూస్తే రోగగ్రస్తమై, లేమితో కూడిన అసహనము, బాధతో, ఆవేదనతో నిండియున్నది. వీటిని ఎలా నివారించగలము? ఇలాంటి పరిస్థితులు వున్నప్పుడు రాబోయేరోజులలో ఏమి చేయగలము? ఆలోచించగలిగే ప్రతీవ్యక్తి ఈ ఆలోచనలతో కింకర్తవ్యవిమూఢు లవడము సామాన్యమే. భవిష్యత్తులో ఏమి జరుగుతుందో ఊహించలేకుండా ఉన్నాము.

## 6. సదుపయోగము చేయగలిగితే పరివర్తన సంభవమే

మానవుడు అనంతశక్తుల యొక్క భాండారము. వాటిలో అతి స్వల్పమైన అంశము శరీరావసరములకు వినియోగించ బడుతుంది. మిగిలిన శక్తి ప్రసుప్త, మూర్ఛితస్థితిలోనే ఉంటుంది. ఉపయోగించుకొనకపోతే పదునైన పరికరములు కూడ త్రుప్పుపడతాయి. ప్రతిభయొక్క అంగప్రత్యంగములను ఉపయోగించుకొనకపోతే మనిషికూడ గానుగెద్దువలె ఏదోవిధంగా బ్రతుకును వెళ్ళదీస్తాడు. కానీ ఎప్పుడైతే అతనిలోని ఉత్సాహము పెల్లుబుకుతుందో అప్పుడు తత్పరత, లక్ష్యశుద్ధి, స్ఫూర్తి, లోతులలోకి దిగగలిగే సామర్థ్యము, సంపాదించాలనే కోరిక తమ చమత్కారములను చూపించగలుగుతాయి. దానితో ఎక్కడోవున్న వ్యక్తి ఎక్కడికో చేరుకోగలుగుతాడు. సాధారణ పరిస్థితులలో కూడ ఇటువంటి వ్యక్తి ఇతరులను ఆశ్చర్యచకితులను చేసే పనులు



చేయగలుగుతాడు.

గత మూడు శతాబ్దములకాలము భౌతిక ప్రయోజనములకే పరిమితమైననూ; దానిని ఆత్మజాగృతికాలము అనాలి. శక్తిని ఎక్కడ ప్రయోగించినా అది తన పనిని చేస్తుంది. చేసిందికూడ. భౌతిక ప్రగతి దిశలోనే దాన్ని ఉపయోగించినప్పుడు ఆ దిశలోనే అనేక అన్వేషణలు జరిగి ప్రత్యక్షవాదముయొక్క పాతమూసలోనే బుద్ధివాదమునకు క్రొత్త రూపమును తయారుచేసింది. క్రొత్త స్ఫూర్తితో నూతనత్వము ఆవిర్భవించినప్పుడు దాని పరిణామాలుకూడ అసాధారణంగా ఉంటాయి. ప్రగతిపేరుమీద విస్తృతిచెంది క్రొత్త రూపము సంతరించుకున్న భౌతికవాదము మరియు ప్రత్యక్షవాదము ప్రపంచములోని వ్యక్తి వ్యక్తిని ప్రభావితము చేశాయి. వైజ్ఞానిక ఆవిష్కారములు అనేక సుఖసాధనల భండారమును పెంచాయి. తెలివితేటల పేరుమీద ఎంత ఎక్కువ విషయాలగురించి జ్ఞానము సమకూర్చుకున్నారంటే అది ఎవరినైనా అహంకారిగా మార్చవచ్చు. అలా జరిగిందికూడ. విభిన్న విషయాలగూర్చి రకరకాల జ్ఞానము సంపాదించుకొనుట అభినందనీయమైన కార్యమే. ఎవరు దీనికొరకు ఉత్సాహము, పురుషార్థము చూపించారో ప్రగతిశీలురు అనే కీర్తికూడ వారికి లభించింది.

## 7. సదుపయోగము - దురుపయోగము

విషయము ఇక్కడితో ఆగదు. ఇంతకంటే పెద్ద రూపాన్ని ధరించి మన ముందుకు వస్తుంది. అదేమిటంటే శక్తి యొక్క సదుపయోగ, దురుపయోగములలో ఏదో ఒకటి ఎన్నుకొనుట. స్వార్థము, ముందుచూపులేకపోవుట అనే వాటి సమన్వయము ఎప్పుడు జరుగుతుందో అప్పుడు - ఎంత ఎక్కువ సంభవమైతే అంత కూడబెట్టుకుని, ఎంత ఎక్కువ ఇంద్రియసుఖాలు పొందగలమో అంత పొందాలి అనే ఒకే లక్ష్యము ఉంటుంది. తొందరపాటు గలవారు, చిన్నపిల్లల మనస్తత్వము గలవారు ఇదే చేస్తారు. వీరు పొందిన సాధనాసామగ్రిని సహనముతో, సమయము వెచ్చించి సత్ప్రయోజనములకొరకు ఉపయోగించే స్థితిలో ఉండరు. బంగారుగ్రుడ్డు ఇచ్చే బాతుయొక్క పొట్ట చీల్చి అన్ని గ్రుడ్లను ఒకేరోజు పొందాలనుకునే తొందరపాటు స్వభావము గల వ్యక్తి చేసిన ప్రయత్నాలే వీరూ చేస్తారు.

ఏ వస్తువునైనా సదుపయోగము చేయగలిగితే మనకుకానీ, ఇతరులకుగాని మంచిని చేకూర్చవచ్చు. కానీ ఆ వస్తువుయొక్క దురుపయోగంవలన ఒక అగ్గిపుల్లతో ఊరినంతటిని తగులపెట్టగలిగే అనర్థము జరుగవచ్చు. ప్రగతిశీల మనుకునే ఈ శతాబ్దులలో ముందుచూపు లేకపోవుటవలన మనము చాలా



పొందినా, వాటి సదుపయోగము జరుగకపోగా, వాటి దురుపయోగం వలన నేడు అన్ని దిశలలో ప్రమాదాల మేఘాలు ఘనీభూతమౌతున్నాయి.

నేటి వైజ్ఞానిక ఉపలబ్ధులు, శాసకుల, ధనవంతులయొక్క లాభాలకుమాత్రమే పరిమితమై వుండివుండకపోతే సాధారణజనుల స్థాయిని, ఎక్కడ్నుంచో, ఇంకెక్కడికో తీసుకొనివెళ్ళివుండేవి. ఎప్పుడైతే యంత్రాలు మనిషియొక్క క్రియాకలాపాలలో సహాయపడటము మొదలెట్టాయో, వాటిని ఇంకా చిన్నచిన్న పరిమాణములో తయారుచేసి తక్కువ ధరకు అందిస్తున్నారు. తక్కువ శ్రమతో, తక్కువ సమయంలో కావల్సినవి సమకూర్చుకుని జీవించడము సాధ్యమైనప్పుడు మిగిలిన కాలాన్ని, కళాకౌశలాల అభివృద్ధికి, వ్యక్తులను యెక్కువ సుయోగ్యులుగా తయారుచేయుటకు ఉపయోగించుకొనేవారు. దీనివలన అన్నిచోట్ల ఆనందదాయకమైన వాతావరణము ఏర్పడేది. పనిలేకుండా ఎవ్వరూ ఉండేవారుకాదు. అంతేకాక ఎవ్వరికీ వ్యక్తిత్వ వికాసానికి మరియు సమాజముయొక్క సర్వతోభివృద్ధికి సహాయపడటానికి సమయము లభించుట లేదు అనే మాట వినిపించేదికాదు. దురుపయోగము దురుపయోగమేకదా! దీనివలన అమృతంకూడ విషముగా మారుతోంది.

## 8. సునియోజనము యొక్క సవ్యమైన పరిణతి

పెద్దపెద్ద పట్టణాలను నిర్మించి వాటిని విస్తృతపరచటానికి ఉపయోగించిన తెలివితేటలను గ్రామాలవైపు మళ్ళించివుండివుంటే ఈపాటికి అన్నిచోట్లా చిన్నచిన్న స్వావలంబీ మరియు పుష్పించి, పల్లవిస్తున్న, వికసించిన చిన్నచిన్న పట్టణాలు కనిపించివుండివుండేవి. పెద్ద పట్టణాలలోని గందరగోళము, విషయుక్త వాతావరణము మరియు అనేకరకాల వికృతులను భరించాల్సిన అవసరము వచ్చివుండేదిగాదు. మరియు చిన్న గ్రామాలనుండి పెద్ద పట్టణాలకు ప్రతిభ వలసవెళ్ళిపోవుటవలన అవి ఈనాటి దయనీయమైనస్థితిలో ఉండవల్సిన అవసరము వచ్చేదిగాదు.

వ్యక్తిగత లేక సార్వజనీన క్షేత్రాలలో జరిగే యుద్ధాలను, ఒకేవిధముగా తప్పు అని ప్రకటించివుండేవారు. చిన్నచిన్న పంచాయతీల లాగ అంతరాష్ట్రీయ పంచాయతీలు కూడ వివాదముల నన్నింటినీ పరిష్కరిస్తూ వుండివుండేవి. ఆయుధాలు స్వల్పపరిమాణములో రక్షకభటుల దగ్గర లేక అంతరాష్ట్రీయ పంచాయతీల వద్దనే వుండేవి. అప్పుడు యుద్ధసామగ్రి తయారుచేయుటకు వినియోగించబడుతున్న నేటి విశాల ధనశక్తి, మరియు జనశక్తిని ఆ దిశలో ఉపయోగించాల్సిన అవసరము వుండేదికాదు. అదే జనశక్తి మరియు ధనశక్తిని - శిక్షాసంవర్ధన, పరిశ్రమల సంచాలన, వృక్షారోపణ మొదలగు అనేక



ఉపయోగకరమైన పనులకు వినియోగించినట్లయితే, యుద్ధాలకొరకు వుపయోగించబడుతున్న ఈ శక్తి సృజన కార్యాలకు ఉపయోగపడి ఒక అద్భుత, అసాధారణ ఫలితమును పొందగలిగివుండేవారము.

విద్య(శిక్ష)యొక్క ప్రయోజనము ఒక గుమాస్తా లేక ఉన్నతాధికారియో అగుటకాక సమాజవ్యవస్థ మరియు జన-జీవితముయొక్క వ్యావహారిక సమస్యల సమాధానము కొరకు ఉపయోగించబడేది. అప్పుడు అందరూ శిక్షితులై సభ్య, సుసంస్కారవంతులై ఉండేవారు. వారు తమ సామర్థ్యమును సర్వత్రా వికాసము మరియు ఉల్లాసమును పెంపొందించేందుకు ఉపయోగించేవారు. శిక్షితుడైన ప్రతీవ్యక్తికి ఇద్దరు అశిక్షితులను - శిక్షితులుగా చేసినప్పుడే పెద్ద పదవిని పొందగల్గే యోగ్యత లభిస్తుందనే నియమము ఉండివుంటే ఈనాటి నిరక్షరాస్యత సమస్యకు సమాధానము ఎప్పుడో అయిపోయివుండేది. విద్యాలయాలతోపాటు, పారిశ్రామిక శిక్షణ (I.T.I) తప్పనిసరిగా జోడించబడివుంటే నిరుద్యోగసమస్య, పేదరికము కనిపించేవిగావు.

ప్రెస్సు మరియు చలనచిత్రములు - ఈ రెండు పరిశ్రమలు ప్రజాభిప్రాయమును ప్రభావితము చేయుటలో చాలా పెద్ద పాత్ర వహిస్తాయి. విజ్ఞానముయొక్క ఈ రెండు ఉపలబ్ధులతోపాటు వీటికి ఉపయోగపడే అంగీకృతమైన ఆలోచనావిధానాన్ని మాత్రమే

ముద్రించాలి లేక చిత్రీకరించాలి అనే అనుశాసనము జోడింపబడివుంటే వ్యక్తియొక్క సర్వతోముఖీశిక్షణయొక్క అవసరము నెరవేరివుండేది. జనసాధారణమునకు విషయపరిజ్ఞానము ఉండి సుసంస్కారవంతులుగా తయారుచేయుటలో సఫలత లభించివుండేది.

## 9. పరిష్కారము ఇలా కూడ సంభవమైయుండేది!!

తెలివితేట లున్నవారుకూడా ఒకవిధంగా వైజ్ఞానికులే. శాసనతంత్రము, సమాజములోని విభిన్న క్రియాకలాపాలు వారి నిర్దేశములు మరియు ఒత్తిడి వల్లనే జరుగుతాయి. సమాజములోని చెడుఅలవాట్లను, వ్యక్తిగత అనాచారాలను నిరోధించే కంచెగనుక వీరు ఏర్పాటు చేసివుంటే పతనానికి దారితీసే శక్తిని మళ్ళించి దానిని సత్ప్రయోజనాలకి ఉపయోగించుకొనేవారు. అపరాధాలు, అనాచారాలు కంటికికూడ కనిపించేవికాదు. అందరినీ ఒక సగటు నాగరికుడి జీవితవిధానము అవలంబింపజేసే వెసులుబాటు కలుగచేయగలిగితే బీదరికము అనే మాటే వినిపించేదిగాదు. అందరూ ఒకేరకంగా (ఏకత) మరియు ఒకేవిధంగా(సమానత) జీవనము జీవించేవారు. అప్పుడు సమాజములో రకరకాల వైషమ్యాలు వుండేవికాదు. అందరూ సమానస్థాయిలో వుండి, అందరూ వారికి తగిన రీతిలో ఎదగటానికి వీలు కలిగివుండేది. అప్పుడు ఈ శతాబ్దులలో జరిగిన బౌద్ధిక, వైజ్ఞానిక ప్రగతిని అందరూ కొనియాడేవారు. వాటి సదుపయోగము



వల్ల పృథ్వి యొక్క కణ-కణము ధన్యమైపోయేది.

మత్తుపదార్థములు, దుర్వ్యసనముల పట్ల చూసీచూడనట్లు వుంటున్నాము. కనుకనే మనుష్యులు వీటిని ఉపయోగిస్తున్నారు. వాటి ప్రతిపాదనే నిషేధించి, ఉపయోగించేవారిని దండించివుంటే, ఈనాడు 'నెమ్మదిగా ఆత్మహత్య' చేసుకునే ఉత్సాహవంతులు తగ్గేవారు!! వ్యసనములకు బానిసకాని వ్యక్తులు శారీరిక, మానసిక సంతులనము కలవారై అన్నివిధములైన నిందలు, అవమానాలనుండి రక్షింపబడేవారు. అనేకరకాలైన దుర్వ్యసనములకు చెందిన రీతిరివాజులు సామాన్యజీవితములో పూర్తిగా కల్సిపోయాయి. కాముకతను పెంచే దుష్ప్రవృత్తులు నేటి ఫాషన్‌లోని ఒక భాగముగా మారాయి. రకరకాల దుస్తులు, శృంగారసామగ్రులు మొదలైనవి సమాజములో ప్రతిష్టకు చిహ్నములుగా భావించబడుచున్నవి. నగలసేకరణలో ఎంతో డబ్బు దుర్వినియోగమౌతున్నది. అభివృద్ధిచెందిన 'బుద్ధివాదము' ఈ అపవ్యయములను నిరోధించి దానివల్ల వచ్చే నష్టాలను వివరించగల్గితే మనలను దరిద్రులుగా, అవినీతిపరులుగా మార్చడానికి ముఖ్య కారణమైన ఆడంబరమైన పెళ్ళిళ్ళు పెచ్చరిల్లివుండేవికావు.

పైకి ఎక్కడము ఎప్పుడైనా నెమ్మదిగానే సంభవము. కానీ పడదల్చుకుంటే క్షణాలలో చాలా క్రిందికి పడిపోవచ్చు. గతించినరోజులలో యిదే జరిగింది. చతురత పేరుమీద మూర్ఖత్వాన్ని పెంచుకున్నాము. దీనికి ప్రమాణ మేమిటంటే 'పైన

పటారము లోన లొటారంగా' వున్న నేటి పరిస్థితులు. చింత, ఉద్విగ్నత, అశాంతి, సంశయాత్మకమైన పరిస్థితులు లోపల, బయటా అంతటా విస్తరించి వున్నాయి. ఎవ్వరికీ శాంతి లేదు, ఎవ్వరికి సంతృప్తి లేదు. విపరీతమైన వైభవమున్నా శాంతిలేకపోవడానికి కారణము **మానసిక దరిద్రత.**

## 10. నిరాశలో ఆశాకిరణాలు

నేటి పరిస్థితులలోని కొన్నింటి గురించి మాత్రమే ఇక్కడ చర్చించుకుంటున్నాము. క్లుప్తంగా చెప్పబడిన దేమిటంటే భవిష్యత్తును సవరించుకునే దిశలో ప్రయాస, పురుషార్థములు జరిగివుంటే బావుండేది. ఇటువంటి పరిస్థితుల్లో నిరాశాపూర్ణమైన మనఃస్థితి ఏర్పడుట సహజమే! కానీ నిరాశ స్వయంగా ఒక పెద్ద ప్రమాదము. దీనితో మనోబలం కోల్పోయి ఉత్సాహంలో అవరోధాలు ఏర్పడతాయి.

సృజనాత్మక ప్రయత్నాలు అసలు జరుగలేదు అని అనలేము. వర్తమానాన్ని సరిదిద్ది, భవిష్యత్తును ఉజ్జ్వలంగా మార్చడానికి చేసే ప్రయత్నాలలో శిథిలత ఉన్నప్పటికి, లేదు అని అనలేము. విపరీత పరిస్థితులు నలువైపులా వున్నా ఉత్సాహము మెండుగవుంటే ప్రతికూల పరిస్థితులలో కూడ ఆశ్చర్యపడే ఫలితాలను పొందగలము. ఈజిప్ట్‌లోని పిరమిడ్లు, పనామాకాలువ, సూయజ్‌కాలువ, చైనాయొక్క విశాలమైన గోడలాంటి ప్రబలప్రయత్నాలు ఆశాపూరిత ఉత్సాహముతో కూడిన సాహసము



వల్లనే సాధ్యమైనాయి. అనేకమంది వ్యక్తులు కల్సి ఒకేసారి బరువును తోస్తున్నప్పుడు వారి సంయుక్తశక్తి మరియు నోటినుండి ఒకేసారి వెలువడిన 'హైసా' అనే ఉత్సాహమును పెంచే హుంకారము లక్ష్యప్రాప్తిని కలుగజేస్తాయి.

రెండవ ప్రపంచయుద్ధములో ఓడిపోతున్న బ్రిటన్‌వాసుల మనోబలాన్ని పెంచటానికి బ్రిటీష్ ప్రధాని సర్‌విన్‌స్టన్ చర్చిల్ 'వి-ఫర్ -విక్టరి' అనే నినాదాన్ని అందజేశాడు. అనగా శత్రువు ఎంత బలశాలి అయినా గెలిచేది మనమే! ఈ సంకేత సూత్రము ఎంత ప్రచారము పొందిందంటే ఇది సునిశ్చిత విశ్వాసము, విజయముయొక్క ప్రతీకగా మారినది. ఈ 'హుంకారము' అద్భుతమైన పరివర్తనను తీసుకువచ్చింది. యుద్ధపు తాకిడితో బలహీనమైన యూరప్ లేచి నిలబడింది. హిరోషిమా దెబ్బకు సర్వనాశనమైన జపాన్ సృజనాత్మక ప్రయత్నాలలో నిమగ్నమై మనోబలము తగ్గకుండా చూసుకొని ఈనాటి ప్రపంచముయొక్క ఆర్థికరంగాన్ని శాసిస్తున్నది. యుగానుసారము మనుష్యుల యొక్క నమ్మకాలలో తగిన మార్పులు తీసుకురాగలిగితే, వాటిని పాటించటానికి తగిన వాతావరణమును నిర్మించగలిగితే ఆనందదాయకమైన భవిష్యత్తును, ఉజ్జ్వలపరిస్థితులను నిర్మించడము ఖచ్చితంగా సంభవమౌతుంది. ఈ ప్రయత్నము నేటి ప్రవాహదిశను పూర్తిగా తల్లక్రిందులుగా చేసే భగీరథప్రయత్నము. కానీ అసంభవము కాదు. ఖచ్చితంగా సంభవమే!!

## 11. క్రియ మారితే ప్రతిక్రియ మారుతుంది

క్రియకు ప్రతిక్రియ ఒక సునిశ్చిత తథ్యము. గడియారముయొక్క లోలకము ఒక చివరికి వెళ్ళాక తిరిగి మరల రెండవ వైపుకు వస్తుంది. ఒక దిశలో చాలా ఎక్కువగా, అతిగా ముందుకు వెళ్ళేవారు కొంత సమయము తర్వాత పశ్చాత్తాపపడి మళ్ళీ పూర్వపుస్థితి రావాలని తపించడము చూస్తూనేవున్నాము.

విషపదార్థములు తిన్నప్పుడు వాంతులు, విరోచనాలు అవడమేగాక ప్రాణాపాయస్థితికూడ సంభవిస్తుంది. కోపిష్టివాడు తన పనుల వలన ఇతరుల పగకు గురి అవుతాడు. దుర్వ్యసనాలు కలవాడు తన ఆరోగ్యాన్ని, సుఖములను, మర్యాదను మూడింటిని పోగొట్టుకుంటాడు. ఎక్కువగా డబ్బు ఖర్చుపెట్టేవారు లేమిని అనుభవించాల్సివస్తుంది. చెడుపనులు చేసేవాడు ఇహపరాలను పోగొట్టుకుంటాడు.

దీనికి విరుద్ధముగా కష్టపడేవారు, క్రమశిక్షణతో మెలిగేవారు రాత్రింబవళ్ళు పూర్తి తత్పరతతో మనస్సును పెట్టి పనిచేసేవారు, వారి అభీష్ట వుద్దేశ్యములను పొందుటలో పూర్తి సఫలతను పొందుతారు.

శక్తుల సదుపయోగము జరిగేరోజులలో సాధారణ పరిస్థితులలో కూడ మనుష్యులు శాంతముగా వుండి సుఖశాంతులు నిండిన వాతావరణములో జీవించేవారు. చరిత్ర గొప్పగా వర్ణించే సత్యయుగం అటువంటి కాలమే! దీనికి



విరుద్ధముగా మర్యాదలను(చేయవల్సినవి) మరియు వర్జనీయము(చేయకూడనివి)లను పరిత్యజించి అనాచారములను, అణిచివేయదగిన పద్ధతులను పాటించడంవలన సహజంగానే కలియుగ పరిస్థితులు ఏర్పడతాయి. ఇటువంటి పరిస్థితులలో అన్నిరకాల సాధనాసామగ్రులున్నా మనుష్యులు భయపడుతూ, భయపెడుతూ, ఈర్ష్య, అసూయలతో రగులుతున్న అశాంతమయ జీవితాలు జీవిస్తారు. ఈరోజులలో ఇలాంటి పరిస్థితులే వున్నాయి. విజ్ఞానము వ్యక్తిని అనంతశక్తిసంపన్నునిగా చేసింది. వికసిస్తోన్న బుద్ధివైభవము అనేక విషయాలను గురించి అవగాహన ఏర్పరచింది. విలాససాధనాలకి లోటులేదు. చుట్టూరా వున్న అలంకరణ సామాగ్రినిచూస్తే స్వర్గములో వున్నామా అనే భ్రమ కలుగుతుంది. ఇవి చాలు అనుకుంటే, గత శతాబ్దులలో అసాధారణ ప్రగతి సాధించాము అని అనుకోవచ్చు. కానీ పైన వున్న ఆవరణను తీసిచూస్తే లోపల దుర్గంధపూరిత విషాణువులు, జీవాణువులుతప్ప ఏమి కనిపించవు. ఇంతటి సిగ్గుపడవల్సిన విషయము శిష్టాచారములను పరిత్యజించుట వలన ఏర్పడింది. విజ్ఞానము, ధర్మము కలసి అడుగులు వేసివుంటే ఈనాటి వైజ్ఞానిక ఉపలబ్ధులు వ్యక్తికి, సమాజానికి ఎంతో సుఖశాంతులతో కూడిన పునాదులను నిర్మించి వుండేవి. సత్యయుగము కంటే గొప్ప పరిస్థితులు వుండేవి. కానీ దౌర్భాగ్యమేమిటంటే **ఈనాడు సదుపయోగము, దురుపయోగమునకు మధ్య వుండే అడ్డురేఖ చెరిగిపోయింది.**

## 12. తీవ్రముగా మారుతున్న పరోక్షజగత్తు ప్రవాహాలు

మనిషి ఏమైనా చేయవచ్చుకానీ వాటి ప్రభావమునుండి తప్పించుకోలేడు. దురుపయోగంయొక్క పరిణామాలు కష్టకరమైనవిగా, బాధాకరమైనవిగానే వుంటాయి. ఈరోజులలో అదే జరుగుతోంది. సంపన్నుల మధ్య, లేనివారి మధ్య ఒక శీతలయుద్ధము జరుగుతోంది. సజ్జనతను ఉపేక్షించే రీతిరివాజుల వ్యాప్తి- స్నేహము, సౌజన్యము, సద్భావనలను పూర్తిగా చెరిపివేస్తున్నది. ఎత్తులకు పైఎత్తులు వేసే పరిస్థితులలో ఇరుక్కుని మానవుడు సంతోషాన్ని, ఉల్లాసాన్ని, సహయోగాన్ని పోగొట్టుకున్నాడు. ఇతరులను పీడించుట మరియు అహంకార ప్రదర్శన కంటే యింకొకటి ఎవ్వరికీ తట్టడములేదు. ఇటువంటి పరిస్థితుల్లో వ్యక్తుల మనఃస్థితి వికృతమగుటచేత సమాజముయొక్క అధఃపతనము సహజమే. ఇక విశ్వజనీన సంతులనము ఎలా సాధ్యము? వాతావరణ కాలుష్యము, అహంకారము, అనాచారము తమతమ విధానాలద్వారా తమయొక్క దురుపయోగాల వల్ల మహావినాశనము జరుగబోతోంది అని హెచ్చరిస్తున్నాయి. భూదోహనము(భూమిలో లభించే అనంత సంపదను విచ్చలవిడిగా పిండుకొనుట), అదుపులేని జనాభా పెరుగుదల, అనుచితమైన ప్రవర్తనల ప్రచారములు, ప్రతివొక్కరిలోనూ అశాంతిని, అవిశ్వాసమును, భయముతో కూడిన పరిస్థితులను ఏర్పరుస్తున్నాయి. రాబోయేరోజులు అంధకారమయంగా కనిపిస్తున్నాయి.



వర్తమానపరిస్థితులుకూడ ఎంత గందరగోళంగా వున్నాయంటే ఒక సమస్యకు పరిష్కారము వెతుకుతూవుంటే పది క్రొత్త విపత్తులు ప్రచండరూపము ధరించి ముందుకొస్తున్నాయి. సహయోగమునకు బదులు సంఘర్షణే స్వభావముగా మరియు అలవాటుగా వ్యాప్తిచెందుతోంది.

ఇటువంటి పరిస్థితులలో సూక్ష్మవాతావరణము కూడ విషపూరితమవుతోంది. తనను బలాత్కరించినవారికి తగిన శిక్ష వెయ్యడానికి ప్రకృతి సమాయత్తమవుతోంది. కరువు, కాటకాలు, వరదలు, భూకంపాలు, రకరకాల రోగాలు వీటి సూచకాలే. **తల్లి వలె పోషణ, రక్షణ ఇవ్వవల్సిన ప్రకృతి ఇప్పుడు, చంపడానికి, చావడానికి కూడ సమాయత్తమౌతోంది.** అణుఆయుధాలు, మృత్యుకిరణాలు, విషాక్తమైన రసాయనాల ప్రయోగమువలన పృథ్వి వుంటుందా? ఉండదా? అనే సందేహం కలుగుతోంది. అన్నిదిశలనుండి కమ్ముకువస్తున్న మహావినాశకర మేఘాలు మహాప్రళయాన్ని సృష్టించబోవడము లేదుకదా అని అనిపిస్తోంది. ఈ భయంకర ప్రవాహాలవల్ల ఈ అందమైన గ్రహము ధూళికణాలుగా మారి అనంత ఆకాశంలో వెదజల్లబడే ప్రమాదము కూడ పొంచివున్నది.

సాధారణముగా పృథ్వి స్థిరముగా వున్నట్లు అనిపిస్తుంది. రోజులు ఈవిధమైన అనుభవముతోనే గడిచిపోతాయి. కానీ సూక్ష్మదృష్టి కలవారికి పృథ్వి తన అక్షముమీద ఒక బొంగరము లాగ తిరుగుతు సూర్యుని చుట్టూ ఒక పక్షి వలె ఎగురుతూ

పరిభ్రమిస్తోం దని తెలుసు. ఇది ఆశ్చర్యకరమైన మన భౌతిక ఇంద్రియాలకు అనుభూతిలోకి రాని విషయమైనా సత్య మిదే. అదేవిధంగా ఒక నగటువ్యక్తికి అంతా నవ్యముగానే మామూలుగానే వున్నట్లు కనిపించినా లక్షణాలను గుర్తించగలిగేవారికి ఈనాటి పరిస్థితులు విస్ఫోటకస్థితిని చేరుకున్నాయని, మనమందరము ఒక అగ్నిపర్వతముమీద కూర్చొని ఉన్నామని, నికటభవిష్యత్తులో మహావినాశకర పరిస్థితులు రాబోతున్నాయని గుర్తించగలరు.

విశేషజ్ఞులు, భవిష్యవేత్తలు ఒకే లాగ 20 వ శతాబ్దపు అంతము చాలా బాధాకరమైన పరిస్థితుల మధ్య ముగుస్తుందని హెచ్చరిస్తున్నారు. ఆ దుస్థితి రేపు, ఎల్లుండిలలోనే మనముందుకు రావచ్చు అనే అనుమానముకూడ వున్నది. ప్రగతి పేరుతో మనము సర్వనాశనదిశకి వెళ్తున్నాము. ఇవాళే అంతా పొందాలి అనే ఆలోచనతో భవిష్యత్తును పణంగా పెడుతున్నాము. పృథ్వియొక్క ఖనిజభాండారాలు అంతమైపోతున్నాయి. పెరుగుతోన్న జనాభాకు ఆహారమే కాక నడవటానికి కూడ పృథ్వి సరిపోకపోవచ్చు. జీవనీశక్తి లేకపోవడము వలన మనుష్యులు ఈగలు, దోమలు వలె దిక్కులేని చావుచావవచ్చు. సంపదలు, ఇతర సుఖసాధనాలు ఎంత ఉన్నా, సద్భావనలు, సహయోగము లేకపోవుటవలన మనుష్యులు ప్రేతపిశాచాల వలె జీవిస్తారు. ఈ లక్షణాలన్నీ ఈనాడు మనముందే ఉన్నాయికదా! రాబోయేరోజులలో ఇవి పెరుగుతాయి తప్ప తగ్గవు అని అనిపిస్తుంది.



## 13. సంతులన - నియంత యొక్క వ్యవస్థలో ఒక భాగము

ఇలాంటి పరిస్థితులలో కూడ ఒక విషయము గుర్తుంచుకోవాలి. ఈ సృష్టికి ఒక నియంత వున్నాడు. తన సమస్త కళాకౌశలములను ఏకీకృతము చేసి పృథ్విని, దాన్ని శాసించుటకు మనిషిని తయారుచేశాడు. అతను ఈవిధమైన సర్వనాశనమును చూస్తూవూరుకోడు. పిల్లలకు ఒక హద్దువరకే ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించుటకు అనుమతి వుంటుంది. ఉపయోగపడే ఖరీదైన వస్తువులను పిల్లలు పాడుచేయటానికి ప్రయత్నిస్తే గారాబము చేసే తల్లిదండ్రులే దండించటానికి కూడ వెనుకాడరు. ఇష్టానుసారము ప్రవర్తించడానికి కూడ ఒక హద్దువుంటుంది. ఇంగితజ్ఞానము, మనము అడుగులు వెనుకకు త్రిప్పుకోవాలి అని తెలుపుతోంది. అనాచారులు విశృంఖలముగా ప్రవర్తిస్తే వారిని కారాగారములో పెడతారు. అప్పుడప్పుడు వారికి మృత్యుదండన కూడ విధిస్తారు. శరీరములో ప్రవేశించిన రోగాలను తరిమికొట్టటానికి **జీవనీశక్తి ఏకత్రితమై** చెయ్యవల్సినది చేస్తుంది. నేటి విపత్కర పరిస్థితులకుకూడ ఇది వర్తిస్తుంది. నియంత సమయానుకూలంగా సర్వనాశనదిశవైపుకు వెళ్తోన్న గ్రుడ్డిపరుగును ఇక ఆపివేయదలచుకున్నాడు. మళ్ళీ కాలప్రవాహమును సంతులిత స్థాయికి తీసుకురాదలచుకున్నాడు. శాసన సంచాలకులు తగినట్లు ప్రవర్తించకపోతే రాష్ట్రపతి శాసన విధింపబడుతుంది. అయోగ్యులకు బదులు సుయోగ్యుల చేతిలో శాసనవ్యవస్థ ఇవ్వడానికి ఇదేవిధమైన **వుచ్చస్తరీయ నియంత్రణ**

అమలుచేయబడుతుంది.

భయము కలిగించే అంధకారము, దానివల్ల వుత్పన్నమయ్యే అవ్యవస్థగురించి అందరికి తెలుసు. అలాగే మనము గుర్తుంచుకోవల్సిన విషయము ఇంకొకటి వున్నది. సృష్టి వ్యవస్థ అంధకారమును ఎక్కువ కాలము భరించదు. బ్రాహ్మీముహూర్తము వస్తుంది. కోడి కూస్తుంది. తూర్పుకనుమలలో ఉషఃకాంతులు ప్రసరిస్తాయి. అవి తమ వెలుతురుతో దశదిశలను నింపుతాయి. క్రొత్త పరిస్థితులు ఏర్పడతాయి. పుష్పములు వికసిస్తాయి. పక్షులు కిలకిలారావాలు చేస్తూ ఎగరడము, గెంతడము మొదలెడతాయి.

స్రష్ట వర్తమాన కాలప్రవాహ దిశ చరమవినాశ బిందువుకు చేరుకొనకముందే ఆపి పరివర్తన యొక్క క్రొత్త వాతావరణము నిర్మించడానికి నిశ్చయించుకున్నాడు. దీనిగురించి సూక్ష్మదృష్టి కలవారందరూ ఒకేవిధంగా తెలుపుతున్నారు. క్రొత్త ఆలోచనావిధానము ఆరంభింపబడుతోంది. దృష్టికోణముయొక్క దిశ మారుతోంది. గతివిధులకు క్రొత్త నిర్ధారణలు వేసే ప్రణాళికలు ఏర్పడుతున్నాయి. ఈ మార్పు మేధావివర్గములో అప్పుడే మొదలయ్యింది. **విస్తృత వాతావరణంమీద నియంత్రణ చేసే అదృశ్యశక్తులు తమతమ కార్యక్షేత్రాలలో తమదైన శైలిలో అవాంఛనీయవిధివిధానాలను తలక్రిందులు చేసి వాటి స్థానములో క్రొత్త విలువలను, లక్ష్యాలను స్థాపించటానికి తగిన చమత్కారములను చూపించడానికి నిర్ణయించుకున్నాయి. (పంచవీరభద్ర సాధన)** మనిషి **యొక్క ప్రచండ పురుషార్థ పరాయణత వల్ల సమయము యొక్క**



**గతి చాలా వేగము పుంజుకున్నది.** సృష్టి ఆదినుండి జరగని అనేక చమత్కారములు గత కొద్ది శతాబ్దములలో చాలా విచిత్రముగా జరిగాయి. అది అవాంఛనీయమైనా కావచ్చు, చెడైనా కావచ్చు. సమయముయొక్క వేగము పెరుగుటవలన గంటకు 3 మైళ్ళు మాత్రమే నడువగలిగే వ్యక్తి ఆ 3 గంటలలోనే విమానాలలో ఎక్కడెక్కడికో చేరుకుంటున్నాడు. మనిషి యొక్క ప్రబల పురుషార్థము యొక్క ఊర్జవల్ల సమయప్రవాహగతి చాలా వేగము పుంజుకున్నది. మానవుడు మంచి చేసినా, చెడు చేసినా వేగంగా చేశాడు. ఈ తీవ్రవేగము ముందు కూడ కొనసాగుతుంది. సవరించే కార్యక్రమాలుకూడ అంతే వేగంగా జరుగుతాయి. తుఫాను ఏ దిశకి తిరుగుతుందో అటువైపే తన ప్రచండతను చూపిస్తుంది.

ప్రతిదానికీ ఒక హద్దు వుంటుంది. రావణ, కంస, హిరణ్యకశ్యప, వృత్తాసురులు మొదలగువారు ఎంత వేగముతో ఎదిగారో అదే వేగముతో వారి అంతముకూడ జరిగింది. నీటిలో బుడగలు చాలా వేగముగా ఏర్పడతాయి. అంతే వేగముతో తమ రూపాన్నికూడ కోల్పోతాయి. పంట పక్వానికొచ్చి కోశాక దాని స్థానములో క్రొత్తపంట వేస్తారు. జర్జర శరీరాలు మరణించి క్రొత్త జన్మను తీసుకుంటాయి. శిధిల భవనాల స్థానములో క్రొత్త భవనాలు లేస్తాయి. ఇదేవిధంగా అవాంఛనీయతల వాతావరణము యిక సమాప్తము కానున్నది. దాని స్థానములో నిజమైన ప్రగతిశీలత వస్తుంది. లంకాదహనముతోపాటు, రామరాజ్యముకూడ అవతరించింది. ఇప్పుడు కూడ అదే జరుగబోవుతున్నది.

## 14. ఇరవైఒకటవ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు

ఈ ఆధారాలవలన 21 వ శతాబ్దము సుఖప్రదమైన సంఘటనల కాలము. 20 వ శతాబ్దముయొక్క ఉపలబ్ధులు తక్కువ, విపత్కర పరిస్థితులు ఎక్కువగా ఏర్పడ్డాయి. ఈ పరిస్థితులలో విప్లవాత్మకమైన మార్పు రాబోతోంది. ఉదయము, సాయంత్రము సంధికాలాలు ఏర్పడినట్లే ఈ కాలము 20 వ శతాబ్దము మరియు 21 వ శతాబ్దముయొక్క యుగసంధి. దీనికికూడ ఒక కాలావధి వున్నది.

1989 నుండి 2000 వరకు 12 సంవత్సరాలు యుగసంధియొక్క మధ్యకాలము. ఈ కాలములో అనేక సూక్ష్మ స్థూల స్థాయిలలో విప్లవాత్మకమైన మార్పులు ఆరంభించబడ్డాయి. ఆరిపోతున్న దీపము ఎక్కువ ప్రకాశవంతముగా వెలుగుతుంది. చనిపోయే ముందు చీమలకు రెక్కలొస్తాయి. మరణము ఆసన్నమైనప్పుడు శ్వాసగతి తీవ్రమవుతుంది.

పగలు, రాత్రి కలిసే సంధ్యాకాలాలు అనేక చిత్రవిచిత్రాలను తీసుకుని వస్తాయి. ప్రసవవేదనపడేటప్పుడు రెండు పరస్పరవిరోధి, విచిత్రములు కనిపిస్తాయి. ఒకవైపు బాధతో కూడిన మూలుగులు వినిపిస్తూవుంటే రెండవవైపు సంతానము కలగబోతోంది అనే ప్రసన్నత, సంతోషము కుటుంబసభ్యులలో కనిపిస్తుంది. యుగసంధి మధ్యకాలము యొక్క ఈ 12 సంవత్సరాలు



సముద్రములోని ఆటుపోటుల వంటివి. ఈ పరిస్థితులలో ఒకవైపు అవాంఛనీయత, ఓడిపోతున్న జూదరి వలె ఒకటికి రెట్టింపు పందెమును పెంచుకుంటూ తన వంతుగా కొంప ముంచుకోవటానికి ప్రయత్నలోపము ఉంచుకోడు. రెండవ వైపు సృజనాత్మక పరిస్థితులు మరియు ప్రయత్నాలు కూడ తన పూర్తి శక్తిని వుపయోగించి పందెములో గెలవడానికి తీవ్రప్రయత్నములలో మునిగివున్నాయి.

**యుగసంధి యొక్క యీ చారిత్రాత్మక కాలములో ఒకవైపు సృజనసంభావనల దృశ్యమానప్రయత్నాలు ప్రభుత్వ , ఆర్థిక, వైజ్ఞానిక క్షేత్రాలలో జరుగుతూ వుంటే ఇంకొకవైపు ఆధ్యాత్మిక శక్తులు కూడ తపఃప్రేరణలకు ఎంత తీవ్రమైన గతినిస్తున్నాయంటే మళ్ళీ భగీరథుడు, దధీచి, హరిశ్చంద్రుడు, విశ్వామిత్రుడు మొదలగువారి గొప్ప గొప్ప విప్లవాత్మక ప్రయత్నాలన్నీ పునరావృతమౌతాయి.**

లోకసేవకుల ఒక పెద్ద సమూహము ఈరోజులలోనే కార్యక్షేత్రములో దిగి రాముని ఎలుగుబంట్లు, కోతులవలె, కృష్ణుని గోపబాలకుల వలె, బుద్ధుని పరివ్రాజకుల వలె మరియు గాంధీగారి సత్యాగ్రహుల వలె ఒక అభినవపాత్రను పోషించి క్రొత్త చరిత్ర సృష్టిస్తాయి.

**ఇవన్నీ అదృశ్యప్రయత్నాల యొక్క అనుకృతి అని అర్థము చేసుకోవాలి.**

## 15. అదృశ్య జగత్తునుండి సక్రియ పరివర్తనా తరంగాలు

కంటికి కనిపించే సంఘటనలు, క్రియాకలాపాలు అదృశ్యజగత్తునుండి ఆరంభమౌతాయి. బ్రతికి వుండటానికి వూపిరి తీసుకొనుట చాలా ప్రధానము. ఇది అన్నము, జలము కంటే అధిక మహత్వపూర్ణమైనది. ఆకాశములో అదృశ్యముగా వుంటుంది. ఋతువులలో మార్పు ప్రాణుల యొక్క క్రియాకలాపాలను అసాధారణముగా ప్రభావితము చేస్తుంది. మనిషియొక్క మంచి చెడు పనులు అదృశ్య జగత్తుయొక్క వాతావరణాన్ని ప్రభావితము చేస్తాయి. అక్కడనుండి తదనురూప పరిస్థితులు ఏర్పడి దృశ్యజగత్తులోకి దిగుతాయి. వీటి ప్రతిఫలమే సుఖదుఃఖాలరూపంలో ప్రకటీకరింపబడుతుంది. ఈరోజులలో జరుగుతున్నదానికి లోకవ్యవహారమే కారణము కాక అదృశ్యజగత్తుయొక్క ప్రచండప్రవాహాలు కూడ కారణము. సమస్యకు సమాధానాలు ప్రత్యక్షస్థాయిలో వుండి తీరాలి. దానితోపాటు స్వాతంత్ర్య సంగ్రామరోజులలో మహర్షి అరవింద, రమణ, పవహారీబాబా,రామకృష్ణపరమహంస మొదలగువారు ఏ పురుషార్థమును చూపించారో అదేవిధమైన ప్రయత్నము సూక్ష్మక్షేత్రములో ఆధ్యాత్మిక ఉపచారాల ద్వారా జరగాలి. పక్షి రెండు రెక్కల ఆధారముగా ఎగురుతుంది. విపత్తులను నివారించి ప్రగతిక్షేత్రములో ఎత్తుకు ఎదగటానికి ముందుముందుకు చొచ్చుకుపోవటానికి సృజనాత్మక క్రియాకలాపాలుమాత్రమే



సరిపోవు. ఏవిధంగా దేవతల సంయుక్తశక్తి దుర్గావతరణకు కారణమైనదో, ఋషుల రక్తముతో నిండిన కుండ సీతాదేవిని వుత్పన్నము చేసిందో అటువంటి ప్రయత్నాలుకూడ జరగాలి. వీటి మాధ్యమము ద్వారానే అసురదమన, లంకాదహన మరియు రామరాజ్యము ఏర్పడటానికి కావల్సిన అదృశ్య పరిస్థితులు ఏర్పడతాయి.

## 16. వ్యాపకపరివర్తనములతో కూడిన సంధికాలము

సృష్ట్యాదినుంచీ ఈనాటివరకు ఇక సర్వనాశనము అయిపోతుంది అనే అనేక పరిస్థితులు వచ్చాయి. కానీ అలా జరగకముందే ముంచుకొస్తున్న కారుమబ్బుల్ని చెల్లాచెదురు చేసే వ్యవస్థ ఏర్పడి, తగిన సాధనాలు ఆవిర్భవించాయి. వృత్రాసుర, రావణ, కంస, దుర్యోధన మొదలగు అసురుల దురాగతాలు వారి కాలములోనే చరమావస్థను చేరుకున్నాయి. కానీ మెల్లిమెల్లిగా ఎలాంటి పరిస్థితులు ఏర్పడినాయి అంటే ప్రళయాంతక సర్వనాశనము జరిగితీరుతుంది అనే పరిస్థితులు నశించాయి. దేవాసురసంగ్రామము మొదలైన అనేక కథలు ఈ కోవకు చెందినవే.

చరిత్రను పరిశీలిస్తే ప్రతీ యుగములో, ప్రతీకాలములో ఈ పరివర్తన ప్రక్రియ నిరంతరం గతిశీలంగా వున్నది అని తెలుస్తున్నది. ఈ కాలములోనే కొన్ని దశకముల క్రిందట సర్వత్రా రాజతంత్రము వ్యాపించియున్నది. ప్రజల సమర్థన లభించినంతకాలము రాజుల

అస్తిత్వం ఉన్నది. ప్రజలకి రాచరిక వ్యవస్థలో ఉన్న లోట్లు తెలిశాక ప్రజాతంత్రము యొక్క ఆధారము క్షణాలలో నిర్మించబడినది. ఒకప్పుడు నారీజాతి మీద అనేక ప్రతిబంధకాలుండేవి. తెరచాటున ఉండటము, భర్త చనిపోతే శవముతో పాటు సహగమనము చేయవలసి వచ్చే వ్యధ భరించవలసివచ్చేది. కానీ ఈనాడు అటువంటి పరిస్థితులు లేవు. ఒకటి, రెండు శతాబ్దాల క్రిందటి వరకు దాస్యఆచారము, జమీందారీ, బాల్యవివాహాలు, నరబలి, అంటరానితనము, జాతివాదము మొదలైన అనేక కురీతులు ప్రచారములో ఉండేవి. కానీ కాలప్రవాహము వాటినన్నింటినీ తలక్రిందులుచేసి సవరించినది. రానున్నరోజులలో ఈ గతిచక్రము ఇంకా వేగము పుంజుకోబోతున్నదని ఆశించటము తప్పేమీ కాదు.

ఇదివరకు కాలము కంటే ఈనాడు పనులు తక్కువ సమయములోనే సంపన్నమవుతున్నాయనేది సత్యము. ఇదివరకు ఏ క్రియాకలాపాలను పూర్తి చేయుటానికి, వాటిని వ్యాపింపచేయుటానికి సహస్రాబ్దులు పట్టేదో, ఇప్పుడవి దశాబ్దాలలోనే పూర్తి అవుతున్నాయి. క్రైస్తవమతము ఎంత వేగముతో ప్రపంచమంతా వ్యాపించిందో అందరికీ విదితమేగదా! ఇదే సామ్యవాదీ విచారధారకుకూడా వర్తిస్తుంది. వందసంవత్సరాలలోపే ప్రపంచంలోని 2/3 వంతులమంది దాని ద్వారా ప్రభావితమయ్యారు. వేలవేల సంవత్సరాల ప్రాచీన సభ్యతలు, ఆలోచనావిధానాలు చాలా మందగతితో వ్యాపిస్తే, ఆంగ్లేయుల సభ్యత ఈనాడు ప్రపంచమంతా వ్యాపించింది.



దీనినిబట్టి చాలా ఎక్కువకాలం పట్టే మార్పులు ఈనాడు అతి తీవ్రగతితో జరిగి తక్కువకాలములోనే ప్రచారము పొందుతాయని నిరూపింపబడుతున్నది.

500 సంవత్సరాల క్రిందట వ్యక్తి ఒకడు ఈనాడు మన మధ్యకు వస్తే మనిషికి రిద్ధి, సిద్ధులు హస్తగతమైన ఒక ప్రపంచములోకి వచ్చానని అనుకుంటాడు. విద్యుత్తు నుండి టెలీకమ్యూనికేషన్స్, లేసర్, కంప్యూటర్ మొదలయినవి పృథ్వీమీద ఆశ్చర్యకరమైన మార్పులను తీసుకువచ్చాయి. మనిషి యొక్క తెలివితేటలు పరాకాష్ఠకు చేరుకున్నాయి అని అనిపిస్తున్నది. మనిషి తన కుశాగ్రబుద్ధి మరియు తీవ్రగతి వలన ఘటనాఘటన సమర్థుడైనాడు. ఈ వేగము రాబోయేరోజులలో పెరుగుతుందే కానీ తరగదు. ఇది అన్ని క్షేత్రాలకి వ్యాపిస్తుంది. విజ్ఞానము, బుద్ధి దీని ప్రభావము లోకి వస్తాయి. మానవజాతి యొక్క ఆలోచనలు, గతివిధులలో అనేక విప్లవాత్మకమైన మార్పులు వచ్చుటయేకాక, అంత వేగముగానూ అవి ఆచరణలోనికి వస్తాయి. ఈ గొప్ప పరివర్తనలకు ఆధారము ఈ రోజులలోనే నిర్మించబడుతోంది. పరోక్షదృష్టి గల 'మనీషీ'లు దీనిని చూస్తున్నారు. దీనినిబట్టి రాబోయే మార్పులను సూచిస్తున్నారు.

ఈ మధ్య అనేకమంది భవిష్యవేత్తల, అదృశ్యద్రష్టల ధర్మగ్రంథాలలో భవిష్యవాణులు, హెచ్చరికలు పుస్తకాలుగా ముద్రింపబడుతున్నాయి. అన్నింటిలోనూ రాబోయేకాలము కష్టకాలమని 'నవయుగసంభావనలకు' నాంది అని చెప్పబడినది.

క్రైస్తవమతములో 'సెవెన్ టైమ్స్', ముస్లిం మతములోని 'హిజ్రీ యొక్క 14 వశతాబ్దము' - సుమారు 20వ శతాబ్దము యొక్క అంతకాలానికి సరి అవుతాయి. నేటికాలవములోనే ప్రకృతివైషమ్యాలుగా జరుగుతున్న ఈ సంఘటనలు కూడా ఈశ్వరీయ దండప్రక్రియగా అర్థము చేసుకోవాలి. అందువల్ల 20, 21 వ శతాబ్దపు సంధికాలములో వాతావరణము కష్టాలతో నిండినట్లు కనిపిస్తే, ఇది సహజమేనని అర్థము చేసుకోవాలి. ఈ కాలములో అక్కడక్కడా సృజనాత్మక క్రియాకలాపాలు గతిశీలమైనట్లు కనిపిస్తే మన కళ్ళు మోసగింపబడుట లేదనీ, అవి యుగసంధికాలములో జరిగే ధ్వంస మరియు సృజన అనే జంట యొక్క అనివార్య ప్రక్రియలని గుర్తించాలి.

## 17. యుగపరివర్తనా కాలము ఇదే ఎందుకు?

'యుగము' అనే మాటకు కాలము అని అర్థము. ఆ కాలఖండము యొక్క ప్రముఖ క్రియాకలాపాలు లేక విశేషతలనుబట్టి వాటిని యుగ శబ్దముతో కలిపి సంబోధించుట సాధారణముగా జరుగుతున్నది. ఉదాహరణకు ఋషియుగము, సామంతయుగము, జనయుగము మొదలయినవి.

ఈ సందర్భములోనే వర్తమానకాలమును విజ్ఞానయుగము, యాంత్రికయుగము అని అంటూ ఉంటారు. ఇదే విధముగా పంచాంగాలలో అనేకానేక సంవత్సరాలు యుగముగా గుర్తించబడతాయి. ఒక మతానుసారము యుగము కోట్ల



సంవత్సరాల కాలానికి వర్తిస్తుంది. దీని ప్రకారము మానవీయసభ్యత మొదలై కోట్లకోట్ల సంవత్సరాలు గడిచాయి. ఇప్పుడున్న కలియుగము సమాప్తమవ్వాలంటే ఇంకా లక్షల సంవత్సరాలు గడవాలి. కానీ లభించిన లిఖితప్రమాణాల ఆధారముగా, చరిత్రకారులు, నృతత్త్వవేత్తల ప్రకారము మానవుని వికాసక్రమము ఎక్కువకంటే ఎక్కువ 19 లక్షల సంవత్సరాల క్రిందటిది. ఆధునిక, సాంకేతిక పద్ధతుల ద్వారా ఇది నిరూపించబడుతున్నది.

కాలగణనయొక్క ఈవిభిన్న విధివిధానాలు నిజానికి వాటిని వివరించే విధానంలో నున్న లోట్లు. శ్రీమద్భాగవతము, మహాభారతము, లింగపురాణము మరియు మనుస్మృతి మొదలైన గ్రంథాలలో యుగాన్ని లెక్కించే పద్ధతి ఏమిటంటే సూర్యుని పరిభ్రమణ కాలమును నాలుగు పెద్ద ఖండములుగా విభజించి నాలుగు దేవయుగముల కల్పన చేయబడినది. ఒక దేవయుగపు అవధి 4,32,000 సంవత్సరాలుగా చెప్పబడినది. దీని ఆధారముగా ధర్మగ్రంథాలలో వివరింపబడిన కలికాలము యొక్క సమాప్తి నేటి కాలానికి సరిపోతోంది.

సహజంగానే సుస్పష్టమైన లెక్కలు లేక, పరస్పర విరోధముగావుండే కాలగణనవలన చాలామంది పైన చెప్పిన ఈ కాలగణనను నమ్మలేకపోవచ్చును. అందువల్ల **ఇక్కడ 'యుగము' అనే పదము విశిష్టలక్షణాలు గల కాలముగా చెప్పబడుతున్నది.** యుగనిర్మాణయోజన ఆందోళన - ఈ

భావమునే తెలియచేస్తున్నది. కాలము మారబోతున్నది అనే భావన ఇందులో స్పష్టముగా పరిలక్షితమవుతున్నది

చాలామంది ఒప్పుకునేదేమిటంటే 1989వ సంవత్సరము నుండి 2000 సంవత్సరము వరకు ఉన్న ఈ పన్నెండు సంవత్సరాలు కలియుగసమాప్తికి, సత్యయుగ ప్రారంభానికి సంధికాలము. ఈ కాలములోనే మానవీయ పురుషార్థముతో కూడిన వికాసము, ప్రకృతి ప్రేరణతో జరిగే వినాశనము ఈ రెండు ప్రక్రియలు తమ తమ ప్రభావాన్ని ప్రతీ క్షేత్రములో చూపిస్తాయి. పన్నెండు సంవత్సరాల కాలము వ్యవహారములో కూడా ఒక యుగముగా పిలువ బడుతున్నది. అందువలన ఈ కాలాన్ని యుగసంధికాలముగా గుర్తించటములో తప్పు ఏమీలేదు.

పన్నెండు సంవత్సరాల కాలములో ఒక నూతన పరివర్తన జరుగుతుంది. మనిషికైనా, వృక్షవనస్పతులకైనా లేక ఈ విశ్వబ్రహ్మాండములోనైనా ఈ పన్నెండు సంవత్సరాలలో జరిగే పరివర్తన స్పష్టముగా కనిపిస్తుంది. మనిషి శరీరములో పన్నెండు సంవత్సరాలలో ప్రతి కోశిక(cell) తనను తానుస్వయముగా మార్చుకుంటుంది ఈ మార్పు పూర్తిగా ఆంతరికమైనది. కనుక స్థూలదృష్టి దీనిని గమనించలేదు. కానీ ఇది విజ్ఞానసమ్మతమే.

కాలగణనలో 'పన్నెండు' అనే సంఖ్యకు విశేష ప్రాముఖ్యత ఉన్నది. ఆకాశములో సౌరమండలాన్ని పన్నెండు రాశులుగా, పన్నెండు ఖండాలుగా విభజించారు. పంచాంగము మరియు



జ్యోతిషము యొక్క లెక్కలు దీని మీదే ఆధారపడి ఉంటాయి. దీనిని అధ్యయనము చేసి జ్యోతిష్కులు రాబోయేకాలము యొక్క స్వభావము మరియు క్రియాకలాపాలను గురించి అంచనా వేస్తారు. పాండవుల పన్నెండు సంవత్సరాల వనవాసము అందరికీ తెలిసినదేగదా! తపశ్చర్యల, ప్రాయశ్చిత్తవిధివిధానాలయొక్క అనేక ప్రయోగాలు కూడా పన్నెండు సంవత్సరాల అవధియొక్క మాహాత్మ్యమును, విశిష్టతను తెలుపుతాయి. దీని ఆధారముగా ఈ పన్నెండు సంవత్సరాల (1989-2000) సంధికాలము అనేక మార్పులకు కారణము అంటే దీనిని నమ్మవచ్చు.

అంతరిక్ష వైజ్ఞానికుల అభిప్రాయము ననుసరించి సూర్యునిలో సౌరకళంకాలుగా రూపొంది, పెరిగి చెదిరిపోయే మచ్చల కాలావధి కూడా పన్నెండు సంవత్సరాలే. వారి ప్రకారము ప్రతీ పన్నెండవ సంవత్సరములో సూర్యునిలో ఒక భయంకర విస్ఫోటన జరుగుతుంది. దీనివలన విద్యుదయస్కాంత తుఫానులలో మార్పు వస్తుంది. దీని ప్రభావము వలన పృథ్వీపై జడ చేతనములన్నింటిలో విశిష్టమైన మార్పులు జరుగుతాయి. నదులు, సముద్రాలలో వరదలు వస్తాయి. వృక్ష, వనస్పతుల ఆంతరిక సంరచన మారుతుంది. జనసముదాయాల మనః స్థితులలో విస్తృతంగా అశాంతి కనిపిస్తుంది. ఖగోళ వైజ్ఞానికుల ప్రకారము 1989-90 ల మధ్యకాలములో కనిపించిన అతి తీవ్రతమ సౌరకళంకములు గత 250 సంవత్సరాలలో ఎప్పుడూ కనిపించలేదు. వాషింగ్టన్‌పోస్టులో వచ్చిన ఈ వార్తను గురించి

తెలుపుతూ హిందూస్తాన్ టైమ్స్ తన ఆగష్టు 29, 1988వ ప్రతిలో ఇలా చెప్పింది "ఈ సౌరకళంకముల ప్రక్రియ వలన ఎంత ప్రచండమైన ఊర్జ బహిర్గతమౌతుందంటే, వాతావరణములో అసంతులన ఏర్పడుట నుంచీ మానసిక విక్షోభాల వరకు ఒక విస్తృతమైన క్షేత్రములో ప్రభావము కనిపిస్తుంది. రాబోయే సంవత్సరాలలో దీనినిబట్టి అసాధారణ సంఘటనలు జరుగవచ్చునని ఊహించవచ్చును".

## 18. అంతఃస్ఫురణ - భవిష్యజ్ఞానము

తెలుసుకొనుట, నేర్చుకొనుట అనే ప్రక్రియ ఇతరుల సాన్నిధ్యములోనే జరుగుతుంది. యాత్రలు, పర్యటనలు దీనిని కొంతవరకు పూర్తిచేస్తాయి. అయినప్పటికీ మనిషి అంతరాళములలో నిహితమైన రహస్యమయ శక్తుల ద్వారా అంతఃస్ఫురణగా లభించే జ్ఞానాన్ని నిర్లక్ష్యము చేయకూడదు. దీనికి ప్రత్యక్షముగా ఏ ఆధారము కనిపించకపోయినా ప్రతీరోజూ పగలు సూర్యుడు ఉదయిస్తాడు, సాయంత్రము అస్తమిస్తాడు అన్నది ఎంత సత్యమో ఈ అంతఃస్ఫురణతో వచ్చే జ్ఞానము కూడా అంతే సత్యము.

ఆరంభంలో అగ్నియొక్క ఆవిష్కారము కూడ అంతఃస్ఫురణయొక్క ఫలితమే! ఈ స్ఫురణ కలిగివ్యక్తి 'ఘర్షణ'ను ఉపయోగించి అగ్నిని కనిపెట్టాడు. దారము వడుకుట, దానితో బట్టలు నేయుట వీటన్నింటి జ్ఞానము - మనిషికి మొదట్లో అంతఃస్ఫురణ వలననే సంభవమైవుంటుంది. భాష, లిపి, ఉచ్చారణ,



అవిజ్ఞాతము యొక్క అసాధారణము, అద్భుతపూర్వము అని భావించబడే అనేక వైజ్ఞానిక శాఖలు, ఆవిష్కారాలు అంతఃస్ఫురణ ఆధారంగానే సంభవ మయ్యాయి. ఒకసారి ఆధారభూతమైన సిద్ధాంతము స్ఫురించాక, దానికి మెరుగులుదిద్దుట, రకరకాలుగా ప్రయోగించుట అనేది సాధ్యమౌతుంది. కానీ ప్రత్యక్షమైన ఆధారమే లేనప్పుడు అనాయాసంగా ఒక వ్యక్తికి ఒక శక్తియొక్క రహస్యమయ నియమాలు స్ఫురించడానికి అంతఃస్ఫురణయే కారణము.

'ఇల్హాం', 'అపౌరుషేయము' అనే శబ్దాలు ధర్మగ్రంథాలలో శృతిఖండములో చెప్పబడ్డాయి. ఈ పదముల అర్థమేమిటంటే మనశ్శక్తి కలిగిన వ్యక్తుల ద్వారా ఈశ్వరీయ వాణి ప్రకటితమైనది. **ఈ ప్రక్రియలో వారు పైగంబరులైనా, దేవదూతలైనా లేక అతీంద్రియ సామర్థ్యమును కలిగిన "మనీషి"లైనా, వారిని వ్యక్తులుగా కాక ఒక ప్రచండ ఆలోచనాప్రవాహముయొక్క ప్రతీకలుగా గుర్తించాలి.** వారిద్వారా భవిష్యత్తులో జరగబోయే సంఘటనలు తెలుపబడ్డాయి. ప్రతిధర్మము, సముదాయాలలోను ఇటువంటి 'ఇల్హాం'ను రహస్యమయ అంతఃస్ఫురణగా గుర్తించాలి.

భవిష్యజ్ఞానము, ప్రాఫెసీ, పూర్వాభాసము ఈ వర్గానికి సంబంధించినవి. చెప్పినవిచెప్పినట్లు జరిగితే అవి నిరాధారము కాదని నమ్ముతాము. వాటి వెనుకాతల సునిశ్చితమైన ఆధారము కచ్చితంగా వుండివుంటుంది. భవిష్యత్కథనముయొక్క ఈ ఆధారము ఏ విద్యమీద ఆధారపడినా దానిని ఆశ్చర్యజనకము,

అద్భుతము లేక దైవీప్రేరణగానే గుర్తిస్తారు. ఈనాడు వైజ్ఞానికులుకూడ వర్తమాన పరిస్థితులను అధ్యయనము చేసి భవిష్యత్తులో జరుగబోయేదానిని చాలావరకు ఊహించవచ్చునని ఒప్పుకుంటున్నారు. ఈ దిశలో భవిష్యవిజ్ఞానము(ఫ్యూచరాలజీ) అనే ఒక శాఖకూడ ఆవిర్భవించినది. ఇది భవిష్యవాణి తంత్రంయొక్క ఒక అంగంగా గుర్తించడములో అతిశయోక్తి యేమి లేదు.

ఈ సందర్భములో ప్రపంచములోని మూర్ధన్య రచయితల అనేక పుస్తకాలు వెలువడ్డాయి. హెచ్.జి. వెల్స్‌యొక్క 'షేప్ ఆఫ్ ది థింగ్స్ టు కమ్', 'టైమ్ మిషన్'; బి.ఎఫ్. స్కిన్నర్‌యొక్క 'బాల్డన్ టూ', 'బ్రేవ్‌న్యూ వరల్డ్', '1984' మొదలగునవి. వీటిని చదివితే రచయిత స్వయముగా భవిష్యత్తును చూచి దానికి పుస్తకాకృతినిచ్చాడా అనిపిస్తుంది.

'ఫ్యూచరాలజీ' లేక భవిష్యవిజ్ఞానము ఇప్పుడు పూర్తిగా విజ్ఞానసమ్మతము. ఒకప్పుడు వైర్‌లెస్, మైక్రోచిప్స్, రోబో, కంప్యూటర్, అంతరిక్షములో తేలుట -ఇతర గ్రహాలకు రాకెట్లను పంపించుట మొదలగునవి ఊహలుగానే భావించేవారు. క్రమక్రమంగా కాలము గడిచిన కొలదీ ఇవన్నీ సంభవమయ్యాయి. ఏ విద్వాంసులైతే కంప్యూటర్‌ని ఉపయోగించి లభించిన సమాచారమునుబట్టి భవిష్యత్తును గురించి వ్రాశారో, వారు వ్రాసిన ప్రకారము నేటి ఈ ఆలోచనలు, భవిష్యత్తులో జరుగుతే ఆశ్చర్యపోవల్సిన అవసరమేమీలేదు. దీనికి కారణాలు వివరిస్తూ'మనీషి' యేమంటాడంటే ప్రవాహము ఎప్పుడూ ఒకేలాగ



వుండదు. దానిలో కాలమునుబట్టి హెచ్చుతగ్గులు వస్తూ వుంటాయి. గాలి ఒకసారి తుఫానుగామారితే ఇంకొకసారి చక్రవాకరూపము ధరించవచ్చు. ఇటువంటి సంభావనలను దృష్టిలో ఉంచుకుని, గుంథర్‌స్టంట్, ఫ్రిట్‌జాఫ్‌కాప్రా, ఆల్విన్‌టాఫ్లర్ అనెడి రచయితలు వారి 'కమింగ్ ఆఫ్ ది గోల్డ్ ఏజ్', 'ది టర్నింగ్ పాయింట్' మరియు 'ఫ్యూచర్‌షాక్' అనే పుస్తకాలలో 21 వ శతాబ్దపు ఆరంభమును విస్తృతపరివర్తన కాలముగా వర్ణిస్తూ రానున్న కాలములో సుఖసమృద్ధులు, శాంతి పెరుగుతాయనెడి సంభావనలు తెలియజేశారు.

ఈ సందర్భములను, తథ్యములను,భవిష్యవాణులను తెలియచేయుటలోని ఏకైక వుద్దేశ్యము యేమనగా, రానున్నకాలము భయానకము కాదనీ, కష్టములతో నిండినది కాదనీ, సుఖమయభవిష్యత్తనీ, విశ్వాసము కలుగచేయుటయేగాక నేటి వర్తమాన బాధాకర పరిస్థితులను చూచి ఊహించినరీతిలో 21 వ శతాబ్ది వుండదు అని తెలియచేయుట. ఈ ఆశయొక్క మూలాధారము మానవునియొక్క అంతఃస్ఫురణ లేక భవిష్యత్తును ఊహించగల్గెడి దివ్యసామర్థ్యము. దీనిని ఏ వ్యక్తి అయినా తనలో జాగృతము చేసుకొనగలడు. నేటి భవిష్యత్తును గురించి వ్యక్తము చేయబడెడి వుజ్జ్వల సంభావనలయొక్క ఆధారము యిక్కడే వున్నది. పరోక్షజగత్తులో జరుగుతున్న క్రియాకలాపాలు విస్తృతస్థాయిలో చేయబడుచున్న ప్రయత్నములు, పురుషార్థములు, ప్రత్యక్షముగా దృగ్గోచరము కాకపోయినను వాటి పరిణతి కచ్చితంగా సుఖప్రదమే.

## 19. వైజ్ఞానిక ఆవిష్కారములు కూడ అంతఃస్ఫురణతో జరిగినవే

అనేకానేక ఆవిష్కారములపై దృష్టిసారించినచో వైజ్ఞానికులు అంతఃకరణములో వీటి స్వరూపము యొక్క రూపురేఖలు ఒక అంతర్బోధనగా వారికి స్ఫురించినదని తెలియుచున్నది. దాని పరిణతి ఒక చిన్న ఆవిష్కారముగా రూపుదిద్దు కున్నది. క్రమక్రమంగా వానిలో మార్పులు, చేర్పుల ద్వారా నేటి విజ్ఞానము యీ ప్రగతిశీలస్థితికి చేరుకున్నది. కొన్ని ఆవిష్కారముల గురించి తెలుసుకుంటే ఇది ఇంకా స్పష్టముగా అర్థమవుతుంది.

న్యూటన్ గురుత్వాకర్షణ సిద్ధాంతమును తెలిపి విజ్ఞానజగత్తులో ఒక విప్లవమును తీసుకొచ్చాడని అందరికి తెలుసు. ఒకరోజు ఆయన ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఒక యాపిల్ పృథ్విపై పడింది. ఈ సంఘటన ఆయన అంతఃప్రజ్ఞలో రకరకాల ఆలోచనలను కలుగజేసింది. ఈ పండు పృథ్వీమీద ఎందుకుపడింది? అని ఆలోచిస్తూవుంటే పృథ్విలో చాలా ఎక్కువగాగురుత్వాకర్షణశక్తి వున్నదిగనుక అది వస్తువులను తనవైపు ఆకర్షించుకుంటుంది అనే అంతర్బోధ కలిగింది.

కిశోరావస్థలో నున్న జేమ్స్‌వాట్ మరుగుతున్న నీటినుండి వచ్చే బాష్పము వల్ల గిన్నెమీద పెట్టిన మూత పైకి క్రిందికి కదులుట



చూచాడు. ఈ సంఘటన ఆయన అంతఃసామర్థ్యమును నిద్రలేపింది. తద్వారా బాష్పశక్తియొక్క సిద్ధాంతము వెలువడి అనేక రైలుబండ్లను నడుపుటయేగాక ఒక పారిశ్రామిక విప్లవానికి బీజాలుపడ్డాయి.

ఫ్రెడరిక్ కెకులే, బెంజీన్ సంరచనగురించి ఆలోచిస్తూ స్వప్నావస్థలోకి వెళ్ళాడు. ఆయన ఒక సర్పము కుండలీ ఆకృతిలో కూర్చునివుండి తన తోకను తనే కరుస్తూన్నట్లు చూచాడు. తక్షణము మేల్కొని తాను చూచిన దృశ్యాన్ని చిత్రముగా గీచాడు. ఆశ్చర్యమేమిటంటే షట్కోణాకృతి గల బెంజీన్ వలయముగా దానిని గుర్తించాడు. ఆట్టోలేవీకి కూడా న్యూక్లియస్ స్నాయుసంధికేంద్రకముల మధ్య విద్యుత్ ప్రవహించడానికి కారణమైన రససమీకరణాల యొక్క అంతర్బోధ జరిగింది. వాటిని కాగితము మీద పెట్టగానే ఎసిటైల్ కోలిన్, కోలీన్‌ఎస్టరేస్ లాంటి అతి ముఖ్యమైన న్యూరోకెమికల్స్‌యొక్క ప్రారంభిక పరిశోధనలకు సంరచనల ఆధారము లభించినది.

నిజానికి దేనిని గురించి వైజ్ఞానికులు, మనీషీలు నిరంతరము ఆలోచిస్తూ ఉంటారో, అవి వారి అచేతనమనస్సుయొక్క గర్భములో ముందే రూపుదాల్చుకునివుంటాయి. కొన్ని అంతర్బోధలుగా, కొన్ని స్వప్నములుగా, కొన్ని అంతఃస్ఫురణలుగా

వికసించిన చేతనత్వముగల 'మనీషి'ల మానసములో బహిర్గతమౌతాయి. అవి ఆవిష్కారములుగా లేక పూర్వాభాసములుగా లేక భవిష్యద్వాణులుగా రూపుదాలుస్తాయి.

బెంజిమన్ ఫ్రాంక్లిన్ అనే అమెరికా వైజ్ఞానికుడు వర్షము కురుస్తున్నప్పుడు ఏర్పడిన మెఱుపులను చూచి ఈ తుఫానులో గాలిపటము ఎగురవేస్తే ఏమౌతుందో చూడాలనుకున్నాడు. తడిగానున్న దారానికి తాళముచెవి తగిలించి నేలపై పెట్టాడు. ఆ ఇనుపతాళపుచెవినుండి విద్యుత్‌స్ఫుల్లింగాలు ఏర్పడటము చూచినప్పుడే వికసించిన ఆయన చేతనత్వములో పిడుగుల నుంచి భవనాలను రక్షించే పరికరము తడిత్ విద్యుత్‌చ్ఛాలకము - (లైట్‌నింగ్ కండక్లర్) యొక్క ఆవిష్కారము జరిగిపోయినది. ఇది 'మనీషి' యందు జాగృతమైన పూర్వాభాసము, అంతర్బోధ యొక్క చమత్కారము. ఏ వైజ్ఞానికవేత్త శ్రమకైనా, పురుషార్థమునకైనా ఈ విధమైన ప్రేరణ లభించుట సహజమే!

ప్రతి కల్పన, ప్రతి ఊహాకందని సంఘటనలకు స్థూలజగత్తులో రూప మిచ్చుటకు దైవీచేతనత్వము ఎప్పుడూ మానవీయ ప్రజ్ఞనే ఉపయోగించుకుంటుందని చరిత్ర తెలుపుతోంది. రాజనీతిజ్ఞులకు, సంఘసంస్కర్తలకు, తత్త్వదర్శకులలకు, ప్రకృతి రహస్యాన్వేషకులలకు, రచయితలకు,



కవులకు, సంగీతజ్ఞులకు వారి భవిష్యకార్యకలాపాలకు దీని ఆధారంగానే ప్రేరణ లభిస్తుంది. అసంభవాన్ని సంభవము చేయగలిగే ప్రేరణాశక్తి దైవీచేతనత్వమునుండే జన్మిస్తుంది. ఈజిప్టులోని పిరమిడ్లు, చైనాయొక్క గొప్పగోడ, పనామా-సూయజ్ కాలువలు, తాజ్‌మహల్, భూమిమీద పంటలు పండించడము లాంటి యుగాంతరీయ(క్రాంతికారీ) పనులు దైవీప్రేరణ వల్లనే సంభవమయ్యాయి. సమాజము సక్రమముగా నడవడానికి ఏర్పర్చబడిన పరంపరలు, పోస్టల్ వ్యవస్థ, నోట్లను ముద్రించుట, ఇవన్నీ అంతర్‌ప్రజ్ఞ ప్రేరణవల్లనే జరిగివుంటాయి. పరబ్రహ్మయొక్క దిశాబోధ వారికి లభించివుంటుంది. పైగంబరులుగా, దైవదూతలుగా మనము కొలిచేవారందరు 'ఇలహామ్' యొక్క విభూతులు పొందినవారే! వికసించిన వారి చేతనత్వము భవిష్యత్తునుకూడ దర్శించగలుగుతుంది.

ఆ అంతఃప్రేరణే, వికసించిన చేతనత్వమే నేడు భవిష్యత్తు గురించి మనకు చెప్పదలచుకున్నాయి. నేటి విపత్కర పరిస్థితులలో రెండురకాల వ్యతిరేక భవిష్యత్కథనాలు వినిపిస్తున్నాయి. 1. రానున్న సంవత్సరాలు, 21 వ శతాబ్దపు పూర్వార్ధము, చాలా ప్రమాదాలు, కష్టాలతో కూడివుంటుంది. 2. ఈ సమయము ఉజ్జ్వల భవిష్యత్తుకు పునాది. వీరి ప్రకారము

మానవ ప్రయత్నాల దిశ మార్చుకుంటే తప్పులు సరిదిద్దుకుంటే రానున్న విపత్తులనే కారుమేఘాలు తొలగిపోతాయి. మేఘాలు ఎంత దట్టంగా కమ్ముకున్నా వాతావరణం, ఎంత భయంకరముగా కనిపిస్తున్నా తీవ్ర ఝంఝామారుతము వాటిని క్షణాలలో చెల్లాచెదురు చేసి వాతావరణాన్ని ఆహ్లాదకరంగా మార్చేస్తుంది. ఇదే మానవ పురుషార్థానికి కూడ వర్తిస్తుంది. పురుషార్థాన్ని ఉపయోగించి ఎలాంటి భవితవ్యతను అయినా అనుకున్నట్లుగా మార్చుకోగలము.

ఈనాడు విశ్వమానవత (వరల్డ్ హ్యూమానిటి) వున్న కాలము పరివర్తనాకాలము- మారుతున్న కాలము. యుగ పరివర్తనములు ఇదివరకు కూడా చాలాజరిగాయి. వీటిని ''సామూహికంగా వికసించబడిన చేతన'' అని కూడా అనవచ్చును. అదుపుతప్పిన పరిస్థితులను సవరించడానికి, ప్రాణచైతన్యముగల ప్రతిభలను కూడగట్టి యుగధర్మము పాటించడానికి ప్రేరణను యిస్తుంది. దీనినే అవతారప్రవాహము అంటారు. ఈరోజులలో ఆ మహాకాలునియొక్క ప్రబలప్రేరణలు యుగపరివర్తనకొరకు నూతన పరిస్థితులను నిర్మించడము చూడవచ్చును. కావల్సిందేమిటంటే సమయమును గుర్తించి మన వ్యక్తిగత ప్రయత్నాలన్నీ కూడ దీనికొరకు వినియోగించగల్గాలి. **పేరుతెచ్చుకొనుటకు మరియు అవతార ప్రక్రియతో కల్సిపనిచేయుటకు ఇదే సరియైన సమయము.**



## 20. ఇరవైఒకటవ శతాబ్దము - దానిపై భవిష్యవేత్తల అభిప్రాయము

యుగపరివర్తన సమయమాసన్నమైనదని ప్రపంచములోని ఉచ్చకోటి ఆలోచనాశీలురు, మనీషులు, జ్యోతిర్విద్వాంసులు, భవిష్యద్రష్టలు అందరూ ఏకకంఠంతో చెప్తున్నారు. వీరందరి ప్రకారము 1989 నుండి 2000 సంవత్సరమువరకు ఉన్న సమయము యుగసంధికాలము. ఈ భవిష్యద్వాణులన్నీకూడ నాల్గింటిమీద ఆధారపడి చెప్పబడినవి.

1. దివ్యదృష్టి సంపన్న వ్యక్తిత్వముల అంతఃస్ఫురణ మీద ఆధారపడిన వాక్కులు.

2. జ్యోతిర్విజ్ఞానము మరియు ఫలిత జ్యోతిషము యొక్క లెక్కలమీద ఆధారపడిన భవిష్యవాణులు.

3. పురాణాలు, ఖురాన్, బైబిల్, గీత, రామాయణము, శ్రీమద్భాగవతము మొదలగు ధర్మగ్రంథములలో వర్ణించబడిన భవిష్యత్కథనములు.

4. నేటి పరిస్థితుల ఆధారంగా వైజ్ఞానిక ఉపకరణముల ద్వారా విషయసేకరణ చేసి వాటిని విశ్లేషించి- వాటి ఆధారముగా విభిన్న భవిష్య వైజ్ఞానికులు చెప్పినది.

మొదటిశ్రేణిలో అతీంద్రియసామర్థ్యముగల వ్యక్తుల భవిష్యత్కథనములను జాగ్రత్తగా పరిశీలిస్తే అందులో చాలా ఎక్కువ శాతము కాలానుసారముగా వారు చెప్పినట్లే జరిగాయి.

నిజానికి దివ్యదృష్టి నుపయోగించి రహస్యమయ అదృశ్యజగత్తులోకి తొంగిచూడవచ్చు. దానిమీద పడివున్న తెరను తప్పించి చూడవచ్చును. అదృశ్యదర్శీవ్యక్తులు ఈ మాటలను ఒప్పుకుంటారుకూడ! వీరందరిని యోగులు, ఋషులు అనలేము, కానీ వారి దివ్యదర్శన సామర్థ్యంవలన వీరు మనీషిలే!

ఇలాంటి 'మనీషి'లలో అగ్రగణ్యులైనవారు ఫ్రాన్స్‌యొక్క ప్రసిద్ధ చికిత్సకుడు నోస్ట్రాడేమస్ మరియు 'కీరో'గా ప్రఖ్యాతి గాంచిన కౌంట్‌లుయిసన్, సుప్రసిద్ధ జర్మన్ దార్శనికులు శోపన్ హావర్, ఇంగ్లాండుకు చెందిన మదర్‌షిట్పన్ అమెరికాకు చెందిన పరామనోవిజ్ఞానవేత్త శ్రీమతి జీన్‌డిక్సన్ మరియు ఎడ్గర్‌కేసి, ఇజరాయిల్‌కి చెందిన ప్రొఫెసర్ హరార్ మొదలగువారు గొప్ప దివ్యదృష్టి గలవారు. వరల్డ్ వైడ్ చర్చ్ ఆఫ్ గాడ్ అధ్యక్షులు ప్లెయిన్‌ట్రూథ్ పత్రిక సంపాదకుడైన హర్బర్ట్ డబ్ల్యు ఆర్మ్‌స్ట్రాంగ్ కూడ వీరి కోవకు చెందినవారే. భారతీయ గొప్ప విభూతులలో మరియు దివ్యద్రష్టలలో మహర్షి అరవిందులవారు, స్వామి వివేకానంద ప్రముఖులు. ఇస్లామ్ మతంలో ప్రసిద్ధ పండితులు సైయద్ కుత్బగారుకూడ ఈ కోవలోకే వస్తారు. ఈ పేర్లు తమ దివ్యదృష్టి ఆధారంగా చూసింది చెప్పిన 'మనీషి' -విభూతులలో కొద్దిమందివి కాలక్రమములో వారు చెప్పినవి చాలావరకు సమయానుసారము సత్యమైనాయి.

**నోస్టర్‌డామస్ :-**

దివ్యదృష్టి కలిగిన భవిష్యద్వక్తలలో అతి ప్రాచీనమైనది, ప్రముఖమైనది అయిన పేరు ఫ్రాన్స్‌యొక్క ప్రసిద్ధ చికిత్సకుడైన



నోస్టర్‌డామస్‌ది. ఆయన 1503లో జన్మించారు. 1559లో చనిపోయారు. వారు చెప్పిన 400 భవిష్యత్కథనాల సంకలన 'సెంచురీన్' అనే పుస్తకములో అనేక ఖండములుగా ప్రచురించబడినది. 15 వ శతాబ్దమునుండి 2037 వరకు జరిగే సంఘటనలను ఆయన తన భవిష్యద్వాణులలో చెప్పారు. 'సెంచురీన్'లో వర్ణించబడిన అన్ని భవిష్యత్కథనములు కాలక్రమములో సత్యమైనాయి. వాటిలో ముఖ్యమైనవి- ఫ్రాన్స్‌లోని రాజ్యవిప్లవము, నెపోలియన్ మరియు హిట్లర్‌లు జన్మించకముందే వారినిగురించి తెలిపినవి. ఇటలీ మరియు ఫ్రాన్స్ సరిహద్దుల దగ్గిర ఒక సామాన్య కుటుంబంలో జన్మించిన పిల్లవాడు, ఒకరోజున ప్రపంచములోని అతి పెద్ద నియంత అవుతాడు. కానీ జీవిత వుత్తరార్ధంలో అతనిని 'హెలేనా' అనే ద్వీపంలో బందీగా వుంచుతారు. అక్కడే మృత్యు వతనిని వరిస్తుంది. చరిత్రకారులకి నోస్ట్రాడేమస్ ఇదంతా ఎలా చెప్పాడో అలాగే జరిగిందని తెలుసు.(నెపోలియన్)

'సెంచురీన్'లో హిట్లర్‌ని హిస్టలర్ పేరుతో భయంకరమైన నియంతగా వర్ణించాడు. హిట్లర్ పుట్టడానికి 350 సంవత్సరాలకుముందే నోస్టర్‌డామస్- ఆయన అధికారంలోకి రావడము, మరియు ఆయన పరాభవముగురించి మొత్తము చరిత్ర వ్రాసిపెట్టాడు. జపాన్ మీద బాంబుల దాడి, తద్వారా ఉత్పన్నమైన ప్రమాదాలు, మానవసంహారము గురించి తన అంతర్‌దృష్టి ఆధారంగా ఆయన ఎలా వర్ణించారో అన్నదానికి

రెండవ ప్రపంచయుద్ధమే సాక్షి. 20వ శతాబ్దముయొక్క చివరి రెండు దశకాలలో భౌతికత, బుద్ధివాదము చరమోత్కర్షను చేరుకొనుట, వైజ్ఞానికక్షేత్రములోని ఆవిష్కారములు, ప్రకృతిని రెచ్చగొట్టడంవలన వచ్చే దైవీప్రకోపాల వర్ణన, చివరికి ఆసియానుండి మానవజాతి వుజ్జ్వల భవిష్యనిర్ధారణ కొరకు ఒక ప్రచండశక్తియొక్క ప్రాదుర్భావము మొదలగు విషయాలు చెప్పాడు. బుద్ధివాదము పరాకాష్ఠకు చేరుకున్నాక, భక్తివాదము శ్రద్ధ సంవర్ధనయొక్క ఒక పెద్ద శాంతిదాయకమైన తరంగము వస్తుంది మరియు యుగపరివర్తన జరిగితీరుతుంది అని నోస్టర్‌డామస్ చెప్పాడు.

'సెంచురీస్' అనే నోస్టర్‌డామస్ పుస్తకాన్ని ప్రపంచములోని 50 మంది కంటే ఎక్కువమంది విద్వాంసులు లోతుగా అధ్యయనము చేశారు. వీరిలో ఒకరు 18 సంవత్సరాల ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిని 'ఐరికా', ఆయన హస్తలిఖిత పుస్తకమును, పుస్తకాలయమునుండి వెలికితీసింది. అధ్యయనకర్త లందరూ చెప్పేదేమిటంటే - అందులో వ్రాసినవన్నీ జరిగిపోయినవి, నికటభవిష్యత్తులో జరుగబోవుచున్నవి. వారిప్రకారము నోస్ట్రాడేమస్ చెప్పిన 'సత్యయుగము' రాకముందు యాంటీక్రైస్ట్ అనే మహాశక్తి ఆవిర్భవిస్తుంది. దీనిని కలియుగ ఆసురీప్రవృత్తియొక్క చరమోత్కర్షస్థితి అనవచ్చును అనేది ఒకటి. ఈరోజులలో ప్రపంచము ఈ యాంటీక్రైస్ట్ చేతిలోనే వున్నది.

ఇది 1999 వరకు వుంటుంది. ఈ అవధిలోనే అనుశాసనాలను,

21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 1 51

ప్రామాణికతలను మరియు వైజ్ఞానిక నిర్ధారణలను సమన్వయపరచే ఒక క్రొత్త ఆధ్యాత్మిక చేతన వుదయించి విపత్తులు జరిగే అవకాశాలను తొలగించి క్రొత్తయుగము ఆవిష్కరింపబడుతుంది. దీనికి ఆయన 'ఏజ్ ఆఫ్ ట్రూత్' అని పేరుపెట్టారు.

తన భవిష్యద్వాణులలో నోస్ట్రాడేమస్ సాంస్కృతిక దృష్టితో సమృద్ధమైన భారతదేశం ఒక మహాశక్తిగా ఆవిర్భవిస్తుందని తెల్పారు. ఆయన దీనికి మూడు వైపులా సముద్రముతో చుట్టబడి, ధర్మప్రధానమైన, అత్యంత ప్రాచీన సంస్కృతిగల ఒక మహాద్వీపమునుండి ప్రపంచమును సర్వనాశనము వైపుకు తీసుకువెళ్ళే మార్గమునుండి వికాసమార్గము వైపుకు తీసుకువెళ్ళే ఒక ఆలోచనా ప్రవాహము ఆవిర్భవిస్తుందని చెప్పారు. 'మనీషి' లందరూ ఈ భవిష్యద్వాణులలో భారతదేశము ఒక విశ్వనేతగా పైకి వస్తుందన్న భావాన్ని చెప్తున్నారు. వారిప్రకారము రాబోయే కాలంలో ఆలోచనలలో విప్లవము(విచారక్రాంతి) నవయుగానికి పునాదులను ఏర్పరుస్తుంది.

**మహర్షి అరవిందులు :-**

భవిష్యద్వక్తలు, ప్రాఫెట్స్ దివ్యదృష్టిసంపన్నులైన 'మనీషి'ల ప్రకారము 2000 సంవత్సరముకు ముందు కనిపించే ప్రళయకాల పరిస్థితులను చూచి నిరాశపడవల్సిన పనిలేదు. విశృంఖలత హద్దుదాటినప్పుడు మహర్షి అరవిందుల వారి

ప్రకారము ఆత్మబలసంపన్నవ్యక్తులలో 'అతిమానసచేతన' అవతరిస్తుంది. ఈవిధమైన ఆత్మబలసంపన్నవ్యక్తులలో దిగిన సామూహిక అతిమానసచేతనను అవతారప్రక్రియ అంటారు. **ఇప్పుడు మహాకాలునియొక్క యుగప్రత్యావర్తన - అవతార ప్రక్రియ, వ్యక్తిగా రాదు. అదొక ఆలోచనాశక్తిగా అవతరిస్తుంది. దానినే నిష్కళంక ప్రజ్ఞావతారము అంటారు.** ఇది వ్యక్తియొక్క ఆలోచనాసరళిని మార్చివేసే ప్రవాహంగా జన్మతీసేనుకున్నది. మరియు బుద్ధావతారము యొక్క ఉత్తరార్ధముగా గత శతాబ్ది నుండి సక్రియముగా వున్నది.

**స్వామీ వివేకానంద :-**

1897 సంవత్సర ప్రాంతలో స్వామి వివేకానందులవారు మద్రాసులో వున్నప్పుడు ఒక ప్రవచనమును చెప్పారు. ఇది వివేకానందుల వాఙ్మయములో 'భారతదేశముయొక్క భవిష్యత్తు ' అనే పేరుతో ముద్రింపబడినది. అందులో స్వామి ఇలా చెప్పారు. " మందిరాలు, వ్యక్తివ్యక్తికీ నిత్యజీవితంలో ఆచరించగల్గే వ్యావహారిక, ఆధ్యాత్మికసూత్రాల నందచేసే జనజాగృతి కేంద్రాలుగా వికసిస్తాయి. విస్తృతంగా సంస్కారశిక్షాకేంద్రాలు తెరవబడతాయి. సంస్కృతియొక్క బహుళప్రచారము జరుగుతుంది. సంస్కృతము విశ్వభాష అవుతుంది. రాబోయే యుగము ఏకత, సమతల యుగము. **ఈ అధ్యాత్మిక సామ్యవాదమునకు కార్యరూపము నివ్వడానికి అనేకమంది నవయువకులు గొప్ప పాత్ర వహిస్తారు.** వారే సంస్కృతిని పరిరక్షించి,



ఉద్ధరించి నవయుగ మనే కల్పనకు సాకారరూపమునిచ్చి చూపిస్తారు."

**దివ్యద్రష్ట ప్రొఫెసర్ హరార్ :-**

దివ్యద్రష్ట ప్రొఫెసర్ హరార్‌ని ప్రపంచములోని ఉచ్చకోటి దివ్యద్రష్టలలో ఒకరిగా పరిగణిస్తారు. ఇజ్రాయెల్‌లోని ఒక ధర్మనిష్ఠులైన యూదుల పరివారములో ఆయన జన్మించారు. ఆయన చెప్పిన భవిష్యత్కథనాలన్నీ యథాసమయములో సత్యమయ్యేవి. రాబోయే మార్పులగురించి చెప్తూ ఆయన ఇలా అన్నారు. "భారతదేశము ఒక విరాట్‌శక్తిగా రూపొందుతున్నదని నాకు స్పష్టముగా కనిపిస్తోంది. ఇక్కడ ఒక సంస్థ ధర్మతంత్రమును మాధ్యమముగా చేసుకుని విచారక్రాంతి కొరకు ఒక విశ్వవ్యాపకమైన వాతావరణమును నిర్మిస్తుంది. 2000 సంవత్సరము నాటికి చిన్నపెద్ద శక్తులన్నీ కలసి ఏకాకారమైపోతాయి. అప్పుడు భాషాబంధనముకానీ, సాంప్రదాయికతకానీ, క్షేత్రీయవిభజనాల సంకీర్ణత గాని వుండదు. అందరూ కలసిమెలసి వున్నది పంచుకుని తింటారు."

**జీన్‌డిక్సన్ :-**

'మై లైఫ్ అండ్ ప్రొఫెసీస్', 'ఏ గిఫ్ట్ ఆఫ్ ప్రొఫెసీస్' మరియు ' ది కాల్ టు ది గ్లోరి' అనే పుస్తకముల రచయిత శ్రీమతి జీన్‌డిక్సన్ తన 14 వ ఏటనుండి భవిష్యద్రష్టగా పేరుపొందింది. ఒక క్రిష్టల్‌బాల్ మాధ్యమంగా ఆమెద్వారా ఇవ్వబడిన భవిష్యత్కథనాలు

XXXXXXXXXXXXXX

నూటికినూఱుపాళ్ళు నత్యమవుతూ వచ్చాయి. ఆవెం యిప్పుడుకూడా అమెరికాలో సక్రియముగా వున్నది. 1945లో అమెరికాయొక్క అప్పటి రాష్ట్రపతి ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ యొక్క మృత్యువునుగురించి అనేక సంవత్సరాలముందే ఆమె తెలిపింది. అదేవిధంగా 1953లో స్టాలిన్ యొక్క మృత్యవు వారి వుత్తరాధికారులగురించి కూడ ఆమె ముందే చెప్పింది. సంయుక్తరాష్ట్రసంఘముయొక్క (యు.ఎన్.ఒ) జనరల్ సెక్రటరి డెక్‌హేమర్‌షీల్ట్ 1961లో ఒక విమాన దుర్ఘటనలో చనిపోతారు అని కొన్ని నెలలకు ముందే ఆమె చెప్పింది, అలాగే జరిగింది కూడా.

1960లో అమెరికా రాష్ట్రపతి జాన్ ఎఫ్ కెన్నడీ ఎన్నికలు గెలవగానే నవంబర్ 1963 యొక్క రెండవవారంలో టెక్సాస్ ప్రాంతములో ఆయన హత్య చేయబడతాడు అని చెప్పిన నాటికే ఆమె ప్రపంచమంతటా ప్రసిద్ధిచెందింది. హత్యకి ముందుకూడ రాష్ట్రపతి భవనానికి ఈమె మూడుసార్లు హెచ్చరికలు పంపింది. కానీ జరుగబోవు సంఘటన ఆగలేదు. జవహర్‌లాల్ నెహ్రూయొక్క అసమయ మృత్యువు మరియు రష్యానేత కృశ్చేవ్‌యొక్క పతనముగురించి కూడ ఆమె ముందే చెప్పింది.

20వ శతాబ్దముయొక్క చివరి 12 సంవత్సరములగురించి ఆమె భవిష్యవాణి ఏమిటంటే 'అమెరికా గృహ యుద్ధముతోపాటు మధ్యపూర్వక్షేత్రములో యుద్ధములో చిక్కుకుంటుంది. యూరోపియన్ సభ్యత భోగవాదము మరియు యుద్ధనీతిని



విడిచి, చివరికి భారతీయ సంస్కృతియొక్క జీవనవిలువలను అనుసరించకతప్పదు. 20 వ శతాబ్దపు ప్రతిభాశీలురైన వైజ్ఞానికులు ఒకే వేదిక మీద ఏకత్రితమై విశ్వమానవతకు క్రొత్త ఆవిష్కారములు అందజేస్తారు. నేటి ఊర్జాయొక్క నంకటమునకు ప్రత్యామ్నాయాలు విరివిగా కనుక్కోబడతాయి. శిక్షాక్షేత్రములో అనేక మార్పులు వస్తాయి. పిల్లలకు ప్రాచీనగురుకులాలవలె, సంస్కారశాలలో సుసంస్కారాల శిక్షణ ఇవ్వబడుతుంది. ఆమె ప్రకారము అప్పుడు మనిషి యొక్క మస్తిష్కవికాసము మరియు అతీంద్రియసామర్థ్యములు ఎంతవరకు వికసిస్తాయి అంటే వారు ఒకరికొకరు తమ ఆలోచనలను సంప్రేషణ చేసుకుని పరస్పరము సంపర్కములో ఉండగలుగుతారు. పంపించుకోగలరు. విశ్వమంతా ఒకే సూత్రముతో బంధింపబడుతుంది.

21 వ శతాబ్దము జీన్‌డిక్సన్ చెప్పిన ఉజ్జ్వల సంభావనలతో నిండివున్నది. 2000 సంవత్సరమువరకు నీతి, అనీతిల మధ్య సంఘర్షణ వుంటుంది. కానీ చివరకు నీతికి, సత్ప్రవృత్తులకే విజయము లభిస్తుంది. 2020 నాటికి పృథ్వీమీద స్వర్గముయొక్క కల్పన సాకారరూపము దాలుస్తుంది. అప్పటికి ప్రదూషణ వుండదు, రోగము లుండవు, ఆకలిచావులు వుండవు. చికిత్సావిజ్ఞానక్షేత్రములో అద్భుతమైన విప్లవము వస్తుంది. ప్రకాశగతి కంటే వేగముగా నడిచే వాయుయానాలద్వారా అంతరిక్షయాత్రలు జరుగుతాయి. 2020 నాటికి సంపూర్ణ మానవజాతి క్రియాకలాపాలు ఒకే విశ్వసత్తా అధీనములో

జరగడము చూస్తాము.

తన ప్రసిద్ధ రచన 'మై లైఫ్ అండ్ ప్రొఫెసీస్' 8వ అధ్యాయములో జీన్‌డిక్సన్ ఇలా వ్రాసింది. '21 వ శతాబ్ది నారీ ప్రధానమైనది. స్త్రీలు విభిన్నక్షేత్రాలలో నేతృత్వము వహిస్తారు.' విశ్వశాంతి స్థాపన దిశలో భారతదేశము యొక్క పాత్రను ఆమె విశేషముగా చెప్పారు. భారతదేశము తన ఆధ్యాత్మిక విలువలు మరియు విచారక్రాంతి మాధ్యమముతో సమస్త విశ్వములో సమతావాదశాసనమును ఆరంభిస్తుంది. ఆమె ప్రకారము రాబోయేరోజులలో ఐ.పి.ఏ. (I.P.A.) యొక్క కార్యాలయము భారతదేశములో స్థాపించబడుతుంది.

## 21. ధర్మగ్రంథాలలో వర్ణింపబడిన భవిష్యత్కథనాలు

ధర్మగ్రంథాలను అపౌరుషేయాలు అంటారు. వీటిని ఈశ్వరీయవాణిగా కొలుస్తారు. దివ్యద్రష్టలు, భవిష్యద్వక్తల వలె వీటిలోకూడ రానున్న సమయముగురించి చాలా చెప్పబడివున్నది. వారంతా 20 వ శతాబ్దము యొక్క అంతము, 21 వ శతాబ్దముయొక్క ప్రారంభము రెండు యుగాలసంధి వలె ఏర్పడి రానున్న యుగము మానవజాతికి ఉజ్జ్వల భవిష్యత్తుగా రూపొందుతున్న విషయములో ఏకాభిప్రాయముతో వున్నారు. ఈ సందర్భములో విభిన్న ధర్మగ్రంథాలు యీ విధంగా చెప్తున్నాయి.

**శ్రీమద్భాగవతము** :- కలియుగముయొక్క అంతము దగ్గరలోనే



వున్నది . ఈకాలము యుగసంధి కాలము. అంతేకాక భాగవతముయొక్క ద్వాదశస్కంధముయొక్క రెండవ, మూడవ అధ్యాయములలో కలియుగము, దానిముందు, దానితర్వాత కాలముల లక్షణాలను విస్తారముగా వర్ణించారు. ఏవిధంగా మధ్యయుగము తర్వాత అశ్రద్ధ పెరిగి, సంస్కారశూన్యత ఏర్పడి ఆచారవిచారాలు ఎలా భ్రష్టుపట్టాయో మొదటి అధ్యాయాలలో వర్ణించబడ్డాయి. 2 వ అధ్యాయములో కలికాలాన్ని విశ్లేషిస్తూ శుకమహర్షి క్రొత్తక్రొత్త రోగాలు ఆవిర్భవించుట, సాంప్రదాయవాదము పెరుగుట, వ్యక్తుల మధ్య పరస్పరము అసహనము పెరుగుట ఈ కాలముయొక్క ముఖ్యలక్షణాలుగా తెలిపారు. ఈనాడు మన మందరము ఇవన్నీ చూస్తున్నాముకదా! సత్యయుగము గురించి తెలుపుతూ కలియుగాంతములో నిష్కళంకసత్తాయొక్క అవతరణ వల్ల సద్భావనలు, సాత్త్వికత సర్వదా అభివృద్ధి చెందుతాయి అని తెలిపాడు.

**వాల్మీకి రామాయణము** :- యుద్ధకాండలో 95వ శ్లోకమునుండి 160వ శ్లోకము వరకు సత్యయుగావతరణ సునిశ్చితమని తెలుపుతూ ఆకాలములో లోకుల వ్యవహారము, దృష్టికోణము, పరిస్థితులగురించి వర్ణింపబడివున్నది.

**హరివంశపురాణము** :- ఇందు భవిష్యపర్వములో కలియుగమునకుముందు సంధికాలం సమాప్తమగుటకు ఈ

కాలమే సరైన సమయముగా చెప్పబడినది.

***మహాభారతము*** : మహాభారతముయొక్క వనపర్వములో ఒక యుగము సమాప్తమై రెండవది ప్రారంభించబడేముందు ప్రపంచములో అనేకరకాల ఉత్పాతాలు జరుగుతాయని చెప్పబడినది. చంద్రుడు, సూర్యుడు, బృహస్పతి, పుష్యమీ నక్షత్రములో ఒకే రాశిలో కలిసినప్పుడు సత్యయుగముయొక్క శుభారంభము జరిగి సుఖద భవిష్యత్తు రూపొందుతుంది.

***ఓల్డు టెస్టిమెంట్‌లో*** :- డేనియల్ మరియు 'రెవలేషన్' అధ్యాయములలో 20 వ శతాబ్దపు సమాప్తినుండి నూతనయుగము వస్తుందనీ దానిముందు ప్రాకృతిక విపత్తులు మరియు మానవుల మధ్య అవగాహనారాహిత్యము చరమోత్కర్షకి చేరుకుంటుంది అని చెప్పబడివున్నది. 'సెవెన్‌ట్రైవ్స్'లో వర్ణించబడిన ఈ భవిష్యత్కథనాలను విశేషజ్ఞులైన పురాతత్త్వవేత్తలు మరియు హిబ్రూభాషా విశారదులైన డా॥ విలియం ఆల్‌బ్రైట్ మరియు జేమ్స్‌గ్రాంటులు విశ్లేషించి ఇవి సరిగా 1980 - 2000 మధ్యకాలంలో జరుగుతాయని చెప్పారు. ఈ భవిష్యత్కథనాలలో 21 వ శతాబ్దపు చివరిలో స్వర్ణయుగస్థాపన కూడ జరుగుతుందని చెప్పబడివున్నది. నోస్ట్రడామస్ యొక్క భవిష్యద్వాణులతో ఇవి పూర్తిగా ఏకీభవిస్తాయి.

***ఇస్లాంధర్మము*** : ఈ ధర్మములోకూడ 14 వ శతాబ్దము అత్యంత కష్టకాలముగా చెప్పబడినది. ఇవికూడ నేటి పరిస్థితులకు పూర్తిగ



సరిపోతాయి. 'ఖురాన్ సారము' అను పుస్తకములో వినోబా 'ప్రళయము తర్వాత పృథ్వీమీద ఎల్లప్పుడూ పగలే వుంటుందని, రాత్రిపూట చీకట్లు ఆవరించవని' వ్రాస్తారు. వీరిప్రకారము ఈ దివ్యప్రకాశముతో విశ్వాత్మకు అద్భుతశాంతి లభిస్తుంది.

'ఇస్లాం భవిష్యకీ ఆశా' అనే పుస్తకములో శ్రీసయ్యద్‌కుల్ ఇలా అంటున్నారు. ' 21 వ శతాబ్దపు ప్రారంభంలో విజ్ఞానము - ధర్మముల మధ్య అద్భుత సమన్వయము జరుగుతుంది. డా॥ కైరేల్ వ్రాసిన 'అజ్ఞాతమానవుడు' గురించి ఉటంకిస్తూ రానున్న కాలములో శిక్షాప్రణాళిక పూర్తిగా మారిపోతుందనీ భావ ప్రధానమైన శిక్ష ఏర్పడుతుందనీ చెప్పారు. ఈ శిక్షణవలన ఆధ్యాత్మిక వాతావరణము ఏర్పడి క్రొత్త మానవజాతిగా పృథ్వీపైన మహానుభావుల ప్రాదుర్భావము ఏర్పడి తద్వారా సర్వత్రా ఏకత మరియు సమతల రాజ్యము స్థాపించబడుతుంది.

ఈవిధంగా దివ్యదృష్టి గల మహామానవులేకాక, విభిన్నధర్మగ్రంథములుకూడా ఒకే తథ్యాన్ని సూచిస్తున్నాయి. అవేమిటంటే నవయుగముయొక్క అరుణోదయ సమయమాసన్నమైనది. ఇప్పుడు సమయప్రవాహానికి అనుగుణ్యంగా వ్యక్తి తన ఆలోచనలను మార్చుకోవాలి. లేకపోతే పరబ్రహ్మ చేతన సత్తా యొక్క దండవ్యవస్థ అతనిని దారిలోకి తెచ్చుకోగలదు. అది అలా చేస్తుందికూడా.

## 22. ఉజ్జ్వల భవిష్య సంరచన కొరకు సంకల్పిత ప్రయత్నాలు

అవాంఛనీయతలను తొలగించి, వాంఛిత వికాసముకొరకు రాజనీతిక, ఆర్థిక, సామాజిక సంస్థల ప్రయత్నము జరిగితీరవల్సినదే! కానీ ఒక విషయము మర్చిపోగూడదు. ఇటువంటి ప్రయత్నాలలో అదృశ్యజగత్తుయొక్క పాత్రకూడా చాలా మహత్వపూర్ణమైనది. నీటి ప్రవాహంతోపాటు చిన్నిచిన్ని పుల్లలు తదనుగుణ్యంగా ప్రవహిస్తాయి. గాలివాటంతో నడిచేవారు తక్కువశక్తి నుపయోగించి తీవ్రగతిని పొందగలరు. ఇందువల్లనే మహత్వపూర్ణకార్యముల శుభారంభము దైవీ ఆవాహనతోపాటు అదృశ్యశక్తుల సాక్షిగా చేయబడతాయి.

ఈరోజులలో ప్రగతిపేరుమీద స్వచ్ఛందంగా చేయబడుతున్న అనేక అవాంఛనీయతల, దుష్ప్రవృత్తుల నిర్మూలన జరుగవల్సివున్నది. వాటిబదులు సత్ప్రవృత్తుల సంస్థాపనకూడ జరగాలి. ఈ రెండు గొప్ప మార్పులకు ప్రత్యక్ష పురుషార్థముతోపాటు అదృశ్యసంకల్పము, సాహసము, ముందుచూపుతోకూడిన కుశలత కూడ కల్సివుండాలి. ఇదే యీరోజులయొక్క ఆవశ్యకత. ఏవిధమైన ఆలస్యము అసాధారణమైన అడ్డంకులు లేకుండా విశ్వవ్యాప్తంగా సంఘర్షణతోకూడిన పరివర్తన ఈ రెండిటి ఆధారంగానే జరుగుతుంది.



కాలము ప్రచండమైన వేగాన్ని సంతరించుకున్నది. వేలాది సంవత్సరాలలో జరుగనటువంటి పనులు ఈనాడు కొన్ని దశాబ్దాలలోనే జరిగిపోతున్నాయి. వంద సంవత్సరాల క్రిందట వున్న వ్యక్తి ఈరోజు వాతావరణాన్ని అప్పటి పరిస్థితులలో పోల్చిచూస్తే ఒక అద్భుతలోకానికి వచ్చానా? అని అనుకుంటాడు. ఇది యుగపరివర్తనగతిలో అసాధారణ వేగము వచ్చినది అన్నదానికి ప్రతీక. రాబోయేరోజులలో ఈ ప్రవాహము ఇంకా ఎక్కువ వేగము పుంజుకుని క్రిందటి శతాబ్దులలో వచ్చిన మార్పులకంటే రానున్న 21 వ శతాబ్దిలో ఇంకా ఎక్కువ చమత్కారాలు అసాధారణరీతిలో జరుగుతాయి. అందువల్ల ఈ ఇరవైఒకటవ శతాబ్దిలో పతనము దిశగా సాగిపోతున్న ప్రవాహం ఆగి, ఉజ్జ్వలభవిష్య నిర్మాణకార్యము తీవ్రవేగముతో జరుగుతుంది అని ప్రజాభిప్రాయము ఏర్పడినది. ఇది మహాకాలుని ప్రేరణ- ఈశ్వరేచ్ఛ -కాలముయొక్క కోరిక. దీనినే యుగధర్మముయొక్క పాంచజన్యశంఖారావము అనవచ్చు. దీనితో ప్రచండమైన మానవీయ పురుషార్థము పెల్లుబుకుతుంది. గుర్తించుకోవల్సినది ఏమిటంటే - దీని వెనుకాతల నియంతయొక్క ప్రచండమైన ప్రేరణ మరియు సునిశ్చిత ప్రణాళిక పనిచేస్తుంది. మానవుడు స్వయముగా అకించనుడు, కానీ ఈశ్వరేచ్ఛను పాటించినప్పుడు హనుమంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు మరియు భీమార్జునులు లాంటి పాత్రలు నిర్వహిస్తూ సర్వత్రా ఆశ్చర్యజనకమైన సాఫల్యములు పొందుతూ కనిపిస్తాడు. గీతాకారుడు అర్జునునితో ఇలా చెప్పాడు. 'కౌరవసమూహమును

నియతి ఎప్పుడో చంపేసింది. రాజ్యసుఖము, అక్షయయశస్సు పొందటానికి ఎందుకు వెనుకాడుచున్నావు? సదవకాశము లభించినప్పుడు దానిని ఉపయోగించుకునే తెలివితేటలనెందుకు ఉపయోగించవు? ఇటువంటి ప్రచండప్రేరణలు అనేకులకు లభిస్తాయి. వీరు అంతఃస్ఫురణ ఆధారంగా అసాధారణ ప్రలోభములనిచ్చికూడా ఎవ్వరూ చేయటానికి ఒప్పుకోని పనులను అతిసహజంగా చేసేస్తారు.

ఈ 12 సంవత్సరాలు గడచేలోపల ఉజ్జ్వలభవిష్యత్తు అనే ఆకాశము నుండి, వర్షించుచున్న మేఘమాలికలు అందరిని ఆశ్చర్యపరచే పరిస్థితులు, వనరులు సమకూరుతాయి. ఈనాడు శ్రేష్ఠ ప్రతిభాశాలియైన వ్యక్తియొక్క మనస్సులో ఒక ఆదర్శవంతమైన పురుషార్థము చేయుటకు ఏర్పడుతున్న ఉత్సాహాన్ని చూచి పైన చెప్పిన మాట యొక్క సత్యమును గుర్తించవచ్చు. జరుగబోయేదానిని తేలికగా వూహించవచ్చు.

ఈ సందర్భములో ప్రపంచముయొక్క మూలమూలలనుండి తమదైన శైలిలో ఆవిర్భవిస్తూన్న సృజనాత్మక తరంగాలతోపాటు అత్యంత మహత్వపూర్ణమైన కార్యప్రణాళిక శాంతికుంజ్-హరిద్వార్ నుండి ప్రకటితమౌతుండగా చూడవచ్చు. ఈరోజులలోనే ఆరంభింపబడిన యుగసంధి మహాపురశ్చరణ మనే ఒక అద్భుత ప్రయోగము గమనించదగినది. దీనిని ఇదివరకు ఎన్నడూ జరుగని సామూహిక సాధనా ప్రయోగ మనవచ్చు. ఒక విశాలమైన సామూహిక ప్రయత్నముద్వారా మాత్రమే వుత్పన్నమయ్యే ఊర్జ



ఈ తపశ్చర్య సాధనవల్ల ప్రకటితమౌతుంది. **భిన్న భిన్న క్షేత్రాలలో వ్యక్తియొక్క శ్రమ మరియు సామూహిక మనోబలముయొక్క ఆశ్చర్యజనక పరిణామాలకు అనేక ప్రమాణాలున్నాయి.** ఆధ్యాత్మికక్షేత్రములో దీని ఉదాహరణ శాంతికుంజ్ నుండి నిర్వహింపబడుతున్న యుగసంధి మహాపురశ్చరణ. యుగసంధి యొక్క ఈ 12 సంవత్సరాలలో సుమారు 24 లక్షలమంది ఇక్కడ, లేక ఇక్కడినుండి సంకల్పము తీసికొని తమ తమ స్థానాలలో పురశ్చరణ ప్రక్రియను కార్యాన్వితము చేస్తారు.

**క్రొత్తగా స్థాపించబడుతున్న ప్రజ్ఞామండలాల సాప్తాహిక సత్సంగములు ఈ యుగసాధనతో సంబంధించిన ప్రయత్నాలుగా గుర్తించాలి.**

శాంతికుంజ్‌ను యుగచేతనయొక్క గంగోత్రి అనవచ్చు. సూర్యుడు మొట్టమొదట తూర్పుదిశ వైపు బయలుదేరి అచ్చటినుండి ముందుముందుకు వెళుతూ సమస్త ప్రపంచానికి వెలుగు నందిస్తాడు. గంగోత్రినుండి ప్రారంభమైన ధార బెంగాలు చేరుకునేసరికి సహస్రధారలుగా పరిణతి చెందుతుంది. ఈ యుగసాధనయొక్క శుభారంభము శాంతికుంజ్ నుండి మొదలై దాని విస్తారము దేశముయొక్క మూలమూలలకు మరియు ప్రపంచముయొక్క ప్రతిప్రాంతానికి విస్తరించడము చూడవచ్చు. దీని ప్రభావమును యుగపరివర్తనయొక్క పృష్ఠభూమిలో ఆంశిక స్థాయిలో అసాధారణ పాత్ర వహించడముగా చూడబడుతుంది. గోవర్ధనపర్వతాన్ని లేపటమనే గొప్ప పనిని అనేకమంది

గోపబాలకులు తమ కఱ్ఱల సహాయంతో ఎలా చేయగల్గారో అలాంటి ఒక సామూహిక ప్రయత్నముయొక్క అవకాశము ఈ సాధనవల్ల సృజనాత్మక క్రియాకలాపాల వెల్లువ మన ముందుకు అనేకవైపులనుండి వస్తాయి.

**ఇలాంటి కార్యక్రమానికి ఉపయుక్తమైన స్థానము వెతికి శాంతికుంజ్ నిర్మింపబడినది. గంగ ఒడి, హిమాలయాలయొక్క ఛాయ, సప్తఋషుల తపోభూమి, దివ్యచేతనల సాన్నిధ్యము, అఖండదీపము, నిత్యయజ్ఞము, నిరంతరము నడిచెడి సాధనలయొక్క సువర్ణావకాశములు ఒకేసారి, ఒకే స్థలములో ఇంకెక్కడా కనిపించదు.**

స్థలము-కాలము యొక్క నిర్ణయము ఒక అసాధారణ మహత్యమును కలిగియుంటాయి. మహా భారతము కొరకు కురుక్షేత్రము ఎన్నుకొనబడినది. భుసావల్ యొక్క అరటిపళ్ళు, లక్నోయొక్క జామకాయలు, నాగపూర్ కమలాలు, మైసూర్‌యొక్క చందనము ప్రసిద్ధము. ఎక్కడపడితే అక్కడ వీటిని పండించగల్గినా ఆ స్థాయి రాదు. విత్తనాలు నాటేటప్పుడు సమయమును గమనించుకొనుట మంచి పంట పండుటకవసరము. వర్షాకాలము, వసంత ఋతువులకు అసాధారణ దృశ్యములను వుత్పన్నము చేయుటకు తమతమ కాలావధు లున్నాయి. ఈ ఋతువుల యొక్క విశేషతలు అన్ని కాలాలలో చూడలేము. శానిటోరియంములు తగిన గాలి, నీరు వుండే స్థలము



వాతావరణములోనే నిర్మింపబడతాయి. బ్రహ్మాండమును అధ్యయనము చేయుటకు కోణార్క్‌లోని సూర్యదేవాలయము వంటి స్థలము చాలా జాగ్రత్తగా ఎన్నుకోబడినది. అక్కడికి ప్రపంచములోని వైజ్ఞానికులందరూ సూర్యగ్రహణములగురించి అన్వేషించుటకు, పరీక్షించుటకు వస్తూవుంటారు. ఇదేవిధంగా ప్రపంచములోని అనేక స్థలాలు వాటి విశిష్టతవల్ల ప్రసిద్ధిపొందాయి. తపస్సు చేయుటకు అనాదిగా హిమాలయక్షేత్రము ఉపయుక్తస్థలముగా గుర్తించబడినది. శాంతికుంజ్ నిర్మించబడిన స్థలముకూడ అనేక సూక్ష్మపరీక్షల తర్వాత ఎన్నుకోబడినది.

**ఇక్కడకు వచ్చిన ప్రతిఒక్కరు తమతమ పాత్రత మరియు అవసరములకు అనుగుణ్యముగా శక్తి, సాహసము, ప్రకాశము, ప్రేరణ పొంది తిరిగివెళతారు.**

ఈ ఆధారములుగానే ఒక అదృశ్య ప్రేరణయొక్క సంకేతంమీద శాంతికుంజ్ చేతనయొక్క ఉద్గమకేంద్రముగా నిర్మించబడినది. దీనిని యుగచేతనయొక్క గంగోత్రిగా గుర్తించి దానియొక్క విశ్వవిస్తరణ ప్రక్రియ క్రియాన్వితమగుచున్నది.

దివ్యచేతన లోకకళ్యాణముకొరకు అత్యవసర వ్యవస్థను ఏర్పరచినప్పుడు సామాన్య సామర్థ్యము గల వ్యక్తుల ద్వారాకూడ అసాధారణ కార్యములు జరుగుట గమనిస్తాము. యుగచేతన కనుగుణ్యముగా **సంకల్పిత ప్రయత్నాలు** చేసే వ్యక్తులకు

శక్తిసామర్థ్యముల అదృశ్యధారలు వాటంతటవే జోడింపబడతాయి. గ్రద్ద-ఉడుత, కోతులు-ఎలుగుబంట్లు మొదలగువానికి ఇదే విధముగా జరిగింది. గోపబాలకులు, పాండవులు కూడ ఇటువంటి ప్రవాహముతోనే జోడింపబడ్డారు. బుద్ధునియొక్క పరివ్రాజకులనుండి గాంధీగారి సత్యాగ్రహుల వరకు యీ సిద్ధాంతము వర్తిస్తుంది. **వారి సామర్థ్యములు సామాన్యమైనవి, కానీ వారి నిష్ఠలు అసామాన్యమైనవి.** నిష్ఠ ఆధారంగా దివ్యచేతనత్వము వారిని తన మాధ్యమంగా ఏర్పరచుకొని లోకకళ్యాణముకొరకు అసాధారణ పనులను చేయిస్తుంది. శాంతికుంజ్‌కు కూడా ఇటువంటి శ్రేయసౌభాగ్యములు లభించాయి.

## 23. విచారక్రాంతియొక్క చిన్న నమూనా!

నిజానికి శ్రద్ధ, తత్పరత మరియు ప్రామాణికతతోపాటు ఉచ్చస్తరీయ ఉద్దేశ్యములకొరకు చేయబడే ఏ సామాన్యస్థాయి ప్రయత్నానికైనా అసాధారణ సాఫల్యము లభిస్తుంది. శాంతికుంజ్ ఈ సూత్రమునే ఉపయోగించుకుంటున్నది. ఈ తథ్యము నంగీకరించే ప్రతిభ కల వ్యక్తులు అత్యంత వుత్సాహంతో నవనిర్మాణక్షేత్రములో ఉత్సాహపూరిత మానసికస్థితిలో అడుగులు ముందుకు వేయవచ్చు. మరియు తమ సంకల్పాలకు దేవతల వరదానాలుకూడ జోడింపబడి వుండటం గమనించవచ్చు. అర్జునునికి రథసారథిగా కూడ దైవీశక్తియే వున్నది. శాంతికుంజ్



సూత్రసంచాలకులు కూడ పరోక్షసత్తాయొక్క ప్రతినిధిగా తాను పొందిన సంకేతముల ఆధారంగానే యీ వనరులన్నీ కూడబెట్టారు.

భవ్యభవనము నిర్మించదలచుకున్నప్పుడు ముందు అతి చిన్న పరిమాణములో దాని నమూనా ఒకటి తయారు చేయబడుతుంది. తాజ్‌మహల్ మొదలగువాటి చిన్న నమూనాలు వీధులలో విక్రయిస్తున్నారు. పెద్దపెద్ద ఆనకట్టలు, పెద్దపెద్ద పరియోజనలు, మల్టీస్టోరీడ్ బిల్డింగ్స్ నిర్మించేముందు ఆర్కిటెక్ట్, ముందు నమూనాలనేర్పరచుకుని ఆతర్వాత భిన్నభిన్న చరణాలలో దానికి సాకార రూపమిస్తాడు. శాంతికుంజ్ 21 వ శతాబ్దములో రానున్న ఉజ్జ్వల భవిష్యత్తుకు ప్రతీకగా తనను తాను ఒక చిన్న నమూనాగా ప్రపంచానికి అందచేసుకుంటున్నది.

ఈ నమూనా, యుగమునకు కాలానుగుణ్యముగా తగిన అవసరాలను అందచేయడానికి యుగమనీషీ ద్వారా చేయించబడే మూడు మహత్వపూర్ణమైన ప్రయత్నాలను అనివార్యముగా పొందుపరచాము.

1. యుగచేతనను జనమానస అంతరాళాలలోకి తీసుకువెళ్ళగలిగే మహాప్రజ్ఞగురించిన రచనలు. **(లేఖనీ)**

2. జనమానసాన్ని కుదిపివేస్తూ తల్లక్రిందులుగా ప్రవహిస్తూన్న నేటి ఆలోచనాస్రవంతిని సరిగా ప్రవహింపజేసే సామర్థ్యంగల పరిష్కరింపబడిన వాక్కు. **(పరిమార్జితవాణి)**

3. తమ ప్రతిభను, ప్రఖరతను మరియు ప్రామాణికతను

అడుగడుగునా నిరూపించగల్గే సమగ్ర అగ్రదూతల పరివారమును తయారుచేయుట. **(పురోధావోం కా పరికర్)**

ఎప్పుడూ పైన చెప్పబడిన మూడు 'యుగక్రాంతుల'లో తమ సమర్థవంతమైన పాత్రను పోషిస్తాయి. అనీతి, అనాచారాలను ఆదర్శవాద ప్రవాహముగా పరివర్తన చేయగల్గే గొప్ప కాయకల్పము ఈ మూడు అమోఘ శక్తులద్వారానే సంపన్నమౌతుంది.

నేటి పరిస్థితులలో ఇది సంభవమేనా? సహజంగానే దీనిని విశ్వసింపలేము. ఎందువల్లనంటే ఈనాడు ఆదర్శములు కేవలము చెప్పేవి, వినేవిగా మాత్రమే మిగిలిపోయాయి. దాన్ని నిత్యజీవితములో ఆచరించవచ్చు అనే విశ్వాసము కుదరటంలేదు. అందువల్ల ఈ మహాప్రయోజనమును పూర్తిచేయుటకొరకు మరియు ఒక విశాలపరికరమును నిర్మించుటకొరకు, ప్రజ్ఞాఅభియాన్‌యొక్క రూపురేఖలు, వాటిని వ్యావహారిక క్రియాన్వయము ఎలా చేయవచ్చో తెలుపుటకు ఒక విశ్వసనీయమైన చిన్న, ఆదర్శవంతమైన మరియు కావల్సిన నిష్పత్తులతో వున్న నమూనా శాంతికుంజ్ రూపంలో నిర్మించబడినది. దీనిని చూచి అర్థము చేసుకుంటే భవిష్యత్తు ఎలా మారుతుంది అన్నదాన్ని గురించి ఒక సవ్యమైన అవగాహన చేసుకోగల్గుతారు. నూతనశతాబ్దమెలా నిర్మించబడుతుందో తెలుస్తుంది.

అన్ని వైపులా కలయచూస్తే, సహజముగా సామాన్యజనులకు



వాడుకలోనున్న దానిని అనుకరించడము సులభము అని తెలుస్తుంది. అవి బుద్ధిసంగతము కాకపోయినా, సమయానుకూలమైనవి కాకపోయినా, ఉపయోగపడేవి కాకపోయినా ప్రజలు వాటిని పట్టుకొని వేళ్ళాడుతూ ఉంటారు. నూతన విధివిధానాలు ఎంత చెప్పినా అవి అత్యంత ఉపయోగకరములైనప్పటికీ వారికి మింగుడుపడదు. చేదుగా ఉన్న ఔషధము రోగాన్ని తగ్గిస్తుందని తెలిసినా దానిని సేవిస్తున్నప్పుడు ముఖమును వికారముగా పెడతారుకదా! ఖాదీవస్త్రాలు ధరించడము యొక్క తత్త్వజ్ఞానము ప్రజలకు హృదయంలో నిలిచిఉన్నంతవరకు దానిని వాడారు. ఇప్పుడు దాని పట్ల ఉదాసీనవైఖరియే ఉన్నది గదా!

విచారక్రాంతి, పాత ఆలోచనాసరళికి స్వస్తి చెప్పి ఉపయోగకరమైన క్రొత్త ఆలోచనా విధానములను అవలంబించండి అని చెప్తోంది. కానీ ప్రాచీనపద్ధతులను సమర్థిస్తూ మన పూర్వజులను అవమానిస్తున్నామని వేలాది అర్థరహితమైన తర్కములు ఇవ్వబడుతున్నాయి. అటువంటప్పుడు అత్యంత సమయానుకూలమైన మరియు అత్యంత ఆవశ్యకమైన ఈ ప్రయత్నాలు ప్రజలందరి ద్వారా ఒప్పించబడాలంటే కొన్ని పెద్దవైన, కఠినమైన ప్రయత్నాలను రాబోయే రోజులలో చేయవలసి ఉంటుంది.

ఈ సందర్భములో రచనలు, ఉపన్యాసములు,

ట్రైనింగుక్యాంపులు నిర్వహించుట నిత్యజీవితములో ఈ నూతన ఆలోచనలను ఆచరణలో పెట్టుటతో పాటు అత్యంత ముఖ్యమైనది ఏమిటంటే ఈ ఆదర్శవాదీ ప్రతిపాదనలను ఎవరైతే చెప్పింది ఆచరిస్తున్నారో వారే చెప్పాలి. ఎవరి ప్రామాణికత, ప్రఖరతల గురించి మనము వేలెత్తి చూపించలేమో వారే చెప్పాలి. ఈ వనరులన్నింటినీ ఏకత్రితము చేసినప్పుడే విచారక్రాంతి గతిచక్రము ముందుకు వెళ్ళగలదు. అతి చిన్న స్వరూపములో మెల్లిమెల్లిగానైనా సరే!

యుగక్రాంతి కొరకు రకరకాల భ్రాంతులమీద అన్ని దిశలనుంచీ దెబ్బకొట్టే ప్రతిపాదనలు ప్రస్తుతము చేయుటయే కాక, వాటి స్థానములో స్థాపించవలసిన వివేకపూరిత ఆలోచనలకు, తర్క,తథ్య, ప్రమాణ ఉదాహరణలతో పాటు భావసంవేదలను స్పష్టముగా తెలిపే శైలిలో ప్రభావము చూపించగలిగే రచనలు చేయువలసియున్నది. వాటిని ప్రచురించుటకు మిషనరీస్థాయిలో ఒక వ్యవస్థను కూడా నిర్మించవలసి ఉంటుంది. సామాన్యంగా ప్రజలు తేలికైన, మనోరంజకమైన సాహిత్యాన్నే చదువుతారు. అటువంటి సాహిత్యాన్నే ప్రకాశకులు ప్రచురిస్తారు. లోకోపయోగకరమైన సాహిత్యమును ప్రచురించుట - మరియు వ్యక్తివ్యక్తికీ దానిని చవకగా కూడా అందచేయటము అవసరము. అంతేకాక శిక్షితుడైన ప్రతీ వ్యక్తి చేత సాహిత్యాన్ని బలవంతముగా చదివించే వ్యవస్థనుకూడా స్థాపించవలసియున్నది.



సాధనములు లేని పరిస్థితులలో పెద్దప్రయత్నాలకు వనరులను ఏకత్రితము చేసుకోలేము. యాచించి అర్థసంగ్రహము చేయటముకంటే - సూత్రసంచాలకులు "అవసరాన్నే " తన కాళ్ళమీదే నిలబడి ప్రజలలోకి వెళ్ళగలిగేటట్లు చేయటము మంచిది అని అనుకున్నారు. అప్పుడు ప్రజల ముందు దీనిని పెట్టగలిగే స్థాయికూడా సహజముగానే సమీక్షింపబడుతుంది.

ఇప్పటినుండీ 50 సంవత్సరాల క్రిందట ఈ ప్రయోజనమునాశించి 'హిందీ అఖండజ్యోతి' ప్రచురణ మొదలుపెట్టాము. ఈ మాసపత్రిక యొక్క ప్రేరణ నిరంతరము నాకు దుర్గమ హిమాలయాక్షేత్రములనుండి లభించుటయే కాక నా చింతన, చేతనల నవనీతము కూడా. మొదట్లో 500 ప్రతులు మాత్రమే అచ్చుగుద్దాము. స్వయంసేవకుల వలె ఇంటి,ఇంటికి వెళ్ళి పంచే క్రమము ఏర్పరుచుకున్నాము. ఇప్పుడు 500 రెట్లు అనగా రెండున్నరలక్షల కంటే ఎక్కువసంఖ్యలో ముద్రింపబడుతున్నది. క్రమక్రముగా ఈ సంఖ్య పెరుగుతూ ఏప్రియల్, 1989 నాటికి అఖండజ్యోతి చందాదారుల సంఖ్య 3 లక్షలకి చేరుకుంది. ఆధ్యాత్మిక తత్త్వదర్శనము యొక్క విజ్ఞానసమ్మత ప్రతిపాదన, విజ్ఞానమునకు నూతన దిశనిచ్చే సమన్వయాత్మక తథ్యముతో కూడిన వ్యాసాలసంకలన, వ్యక్తిలో దాగివున్న అనంతశక్తులు మరియు వాటిని వికసింపచేయటానికి వివిధసాధనల గురించి వివరించే ఈ పత్రిక యొక్క రచన, సంపాదకత్వము (ఎడిటింగ్) హరిద్వార్ నుండే జరుగుతున్నది.

ప్రచురణ మాత్రము మధురనుండీ జరుగుతున్నది. ఎవరు దీనిని చదివినా అతనిని ఈ రచనాశైలి ప్రభావితము చేయుటయే కాక కాలానుగుణ్యమైన నిగూఢ ప్రతిపాదనలకు నూతన ప్రేరణనిచ్చింది.

27 సంవత్సరాల క్రిందట రెండవ పత్రిక యుగనిర్మాణ యోజన పేరుతో ప్రారంభించబడినది. అఖండజ్యోతిలో చెప్పబడిన విషయాలు ఈ పత్రిక పరిధిలోకి రావు. కుటుంబ, సామాజిక నిర్మాణము కొఱకు ఇవ్వబడే ప్రతిపాదనల, ప్రసార ప్రచారము ఈ పత్రిక చేస్తోంది. చూస్తూ చూస్తూ ఇది కూడా 70 వేల ప్రతులు ముద్రింపబడుతున్నవి. గుజరాతీ, మరాఠీ, ఒరియా, తమిళము, తెలుగు భాషల సంస్కరణలు కూడా పెద్దసంఖ్యలో పాఠకులకు అందచేయబడుతున్నవి. వీటిలో "యుగశక్తి" అనే పేరుతో గుజరాతీలో ప్రచురింపబడుతున్న పత్రికకు ఒకటిన్నరలక్షల కంటే ఎక్కువమంది పాఠకులున్నారు. గురుముఖీ, బెంగాలీ, ఇంగ్లీషు సంస్కరణలు, ప్రచురింపబడినా సరియైన వ్యవస్థ లేకపోవుట వలన వాటిని పుస్తకాకారముగా అప్పుడప్పుడూ ప్రచురిస్తున్నాము. ఈ విధముగా పత్రికల ప్రచురణ సంఖ్య 4-5 లక్షల మధ్య ఉంటున్నది. ప్రతీ పత్రికను కనీసము 10మంది చదువుతున్నారు. ఈ విధముగా అన్ని పత్రికలు కలిపి 50 లక్షలమంది పాఠకుల ఆలోచనా చేతనత్వమును ప్రతి నెలా కుదిపివేస్తున్నాయి.

ఏ విధమైన ప్రకటనలు తీసుకోకుండా ఎవ్వరినీ డబ్బు



యాచించకుండా కేవలము తన యొక్క ఉపయోగపడే లక్షణాలు మరియు పాఠకుల యొక్క సహయోగము సద్భావనల ఆధారముతో చందాదారుల సంఖ్య పెరిగింది. కేవలము కాయితము, ముద్రించుట మరియు తపాలా ఖర్చులు (Postal Charges) యొక్క భారమే ఈ ప్రచురణల మీద తీసుకుని లాభము వద్దు - నష్ఠము వద్దు (No Profit -No Loss) ప్రక్రియగా అఖండజ్యోతి పత్రికకు సాలు చందా 60 రూపాయలు (64పేజీలు), యుగశక్తి గుజరాతీ 40 రూపాయలు(52పేజీలు), యుగనిర్మాణయోజన హిందీ సంవత్సరచందా 30 రూపాయలు (36 పేజీలు) నిరంతరము ప్రచురించబడుతున్నాయి. ప్రకటనలు స్వీకరించకూడదు అనే సంకల్పాన్ని నిరంతరము గుర్తుంచుకుంటూ రెట్టింపు ఉత్సాహముతో పాఠకులను ఈ పత్రికలు చేరుకుంటున్నాయి.

గొప్ప ప్రతిభకలవారితో, పెద్దసాధనాలతో విశాలక్షేత్రములో పనిచేస్తే విచారక్రాంతియొక్క మొదటిచరణము(లేఖని) సాధించుట ఏ విధంగానూ అసంభవము కాదు అన్నదానికి ఇది ఉదాహరణ. ఒక వ్యక్తి తన సంపూర్ణ సమర్పణ ద్వారా ఇంత చేయగలిగినప్పుడు ఇటువంటి అనేకుల శ్రమ, సాధన, ఎంత పెద్ద ప్రభావము చూపించగలదో, ఎంత గొప్ప గొప్ప సఫలతలను పొందగలదో దాని గురించి ఊహించుటకు ఎవ్వరికీ కష్టము కాకూడదు.

సాహిత్యక్షేత్రములో స్థిరవిలువలను ప్రతిపాదించగలిగే

పుస్తకముల అవసరము చాలా వున్నది. శాంతికుంజ్ ద్వారా మరియు యుగనిర్మాణయోజన ద్వారా సుమారు 2500 కంటే ఎక్కువ పుస్తకములు యుగసాహిత్యముగా ముద్రింపబడ్డాయి. ఇవన్నీ వ్యక్తి, కుటుంబ, సమాజము యొక్క భిన్న, భిన్న సమస్యల మీద పరిష్కారము చూపిస్తూ వ్రాయబడ్డాయి. దేశము యొక్క విభిన్న భాషలలో ఇవి అనువదించబడ్డాయి. పుస్తకముల యొక్క మూల్యనిర్ధారణలో ఒకే నీతి అవలంబించబడుతున్నది. లాభము వద్దు - నష్టము వదు (No Profit -No Loss) బీద దేశములలో - కుగ్రామాలలో ఉన్న పాఠకుడు ఖరీదైన పుస్తకముల లాభము పొందలేడు. యుగసాహిత్య ప్రచారమునకు ఒకే ఆధారము ఏమిటంటే ఎవరు చదివినా వారు దానిని ఇతరుల చేత చదివించారు - మరియు దానిని కొనుక్కునేందుకు ఉత్సాహపరిచారు. "సంచీపుస్తకాలయమును" భుజముల మీద వేసుకొని పాఠకులు తమకు తెలిసిన ప్రదేశములకు వెళ్తున్నారు. ఇతరులకు పుస్తకములనిచ్చి చదివించి మళ్ళీ తిరిగి వెనక్కి తీసుకుంటారు. ఎవరైనా ఉత్సాహము చూపిస్తే వాటిని అమ్ముతారు కూడా! ఈ కార్యక్రమము విశుద్ధ సేవాభావనతో చేయబడుతుంది. అందువల్ల ఎవరికీ అందులో భాగము(కమీషన్) ఇవ్వటము లాంటి తలనొప్పులుండవు. క్రైస్తవమిషనరీలు మరియు కమ్యూనిష్టు ప్రచారకులు తమ సాహిత్యమును సాధారణముగా ఈ విధముగానే విస్తరింపచేస్తారు.

ఈ పంక్తులు రాసే రచయిత స్వయముగా పత్రికలు,



పుస్తకములు ఎంత గొప్ప క్రాంతిని లేవదీయగలవో కళ్ళారా చూచాడు. ఒక వ్యాపకక్షేత్రములోని వ్యక్తులు గొప్పగొప్ప పనులు చేయటానికి ప్రేరణనిచ్చి విభిన్న భాషలలో విభిన్నప్రదేశాల ఆలోచనలను మథించి సంవర్ధన చేయుటకొఱకు ఈ పుస్తకముల ద్వారానే మహత్వపూర్ణమైన సూచనలు, కార్యాచరణ పద్ధతులు అందచేయబడుతున్నవి. ఈ విధముగానే విస్తృతమైన మార్పులకు ఆధారము లభిస్తుంది.

యుగపరివర్తనకు రెండవ మహత్వపూర్ణ ప్రయత్నము - వాణి లేదా వాక్కును ఉపయోగించుట. సత్సంగములు, ప్రవచనములు, సామూహిక చర్చలు, సభలు, ఆలోచనలు ఇచ్చి పుచ్చుకోవటాలు, సత్రములు, సమారోహములు మొదలైనవి ఈ కోవలోకే వస్తాయి. శాంతికుంజ్‌లో చాలా కాలమునుండి సంవత్సరములో ఒక్కొక్క నెలపాటు జరిగే యుగశిల్పి సత్రములు, మరియు 9,9 రోజుల పాటు జరిగే సంజీవనీవిద్య యొక్క ప్రతిభాసంవర్ధనసత్రములు నడుస్తూ ఉన్నవి. వీటిలో ఇప్పటికి 5 లక్షల కంటే ఎక్కువమంది వ్యక్తులు పాలుపంచుకున్నారు. ఒక నెలపాటు జరిగే యుగశిల్పిసత్రములో ప్రచారకుడిగా పనిచేయగలిగే యోగ్యత అందచేయబడుతుంది. తేలికైన సంగీతమును, సులభముగా నేర్చుకునే సంగీతవాయిద్యములు, కథలు, ప్రవచనాలు, Slides, Projecter, Video మొదలగువాటి ద్వారా ఆదర్శవంతమైన

క్రియాకలాపాలను వివరించుట, గోడలమీద ఆదర్శవాక్యములు రాయించుట, స్టిక్కర్స్ పంచిపెట్టుట, దీపయజ్ఞముల ద్వారా స్వల్పవ్యయముతో పెద్ద మరియు ప్రభావశాలీ కార్యక్రమముల విధివ్యవస్థలను, పరంపరలను ఏర్పరుచుట నేర్పబడుతుంది. సత్రములలో పాలుపంచుకునే వారికి నివాసము, భోజనము, శిక్షణ, అవసరమయ్యే ఉపకరణములు, మొదలగు వాటికి సముచిత వ్యవస్థ ఇక్కడ ఉన్నది. తమ అభ్యాసము మరియు ప్రశిక్షణ ఆధారముగా ఈ ప్రచారకులు ఎక్కడకు వెళతే అక్కడ ప్రజా సమూహములను ఏకత్రితముచేసి వారిని ఉల్లాసపరచడము ద్వారా లోకకళ్యాణము మరియు జనజాగరణ అనే ఉద్దేశ్యాన్ని నెరవేరుస్తారు. ఏ విషయమును వారికి అర్థమయ్యేటట్లు చెప్పాలనుకుంటారో దానిని తేలికైన సంగీతము ద్వారా చెప్తూవుంటారు. వేలసంఖ్యలో ప్రజలు కార్యక్రమాలు వినటానికి వస్తారు. ప్రతీ సంవత్సరము సుమారు 3,500 మంది ప్రచారకులు ఈ సత్రములపద్ధతి ద్వారా ప్రశిక్షణ పొందుతారు.

సమయము అంతగా లేనివారు 9 రోజుల సత్రములలో జీవనసాధపయొక్క సంజీవనీవిద్య జ్ఞానమును పొంది తమ మనః స్థితిని వికసింపచేసుకొనుటకు వస్తారు. వారికి సత్రములు వేరుగా నడపబడుతాయి. వీటిలో పాలుపంచుకునే వారి సంఖ్య సాధారణముగా 500 నుండి 1000 మధ్య ఉంటుంది. ఈ కార్యకర్తలుకూడా తమతమ క్షేత్రాలలో ప్రచారకులుగా పనిచేస్తారు.



## 24. ప్రామాణికతంత్రము యొక్క వికాసము

శిక్షకులకు ప్రశిక్షణ ఇవ్వటానికి ఉన్నత వ్యక్తిత్వముతోపాటు ప్రేరణాత్మక వాతావరణముకూడా కావాలి. ఇవి రెండూ శాంతికుంజ్‌లో లభిస్తాయి. శాంతికుంజ్‌లో సుమారు 500 మంది వ్యక్తులు స్థిరనివాసము ఉంటున్నారు. ఇందులో చాలామంది గ్రాడ్యుయేట్స్. పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయి వ్యక్తులు. పెద్దపెద్ద ఉద్యోగాలను వదులుకొని సూత్రసంచాలకుని ఉదాహరణగా తీసుకుని యుగసృజనశిల్పి సంబంధిత సేవాకార్యక్రమాలకు సమర్పిత భావముతో వచ్చారు. శరీరనిర్వహణ కొరకు బ్రాహ్మణోచిత సాధనా సామాగ్రితో గడుపుకుంటూ ఉత్సాహముగా 12 గంటలు పనిచేస్తారు. వీరిలో చాలామంది తమ సొంతఖర్చులతోనే తమ అవసరాలను గడుపుకుంటున్నారు. వీరు ఆశ్రమము నుండి ఏమీ ఆశించరు, తీసుకోరు. ఇది ఒక అపూర్వమైన, అరుదైన గొప్ప ఉదాహరణ.

పనిచేయగలిగే భావనాశీలురైన కార్యకర్తల యొక్క అభావము సర్వత్రా ఉన్నది. కానీ శాంతికుంజ్‌కి వీరు అనాయాసముగానే లభిస్తూ వస్తూ ఉన్నారు. ఎమ్.డి, ఎమ్.ఎస్, ఎమ్.టెక్, బి.ఐ.ఎమ్.ఎస్, ఎమ్.ఎస్.సి. పి.హెచ్.డి, ఎల్.ఎల్.ఎమ్ (M.D, M.S, M.TECH, B.I.M.S, M.Sc,Phd ,L.L.M) స్థాయిగల అనేక కార్యకర్తలున్నారు. శాంతికుంజ్ సంచాలకుని వ్యక్తిత్వాన్ని ఎవరైతే దగ్గరనుండి అన్నిరకములుగా పరీక్షించి చూశారో వారి

మనస్సులలో ఇటువంటి వాతావరణములో జీవించి ఇటువంటి కార్యప్రణాళిక పాటించి ధన్యులమవ్వాలనిపిస్తుంది. ఈ కార్యకర్తల ద్వారా నిర్మించబడిన వాతావరణము యొక్క ప్రభావమే శిబిరానికి వచ్చిన వాళ్ళ జీవితములలో కాయకల్పము లాంటి స్థితి పొంది తిరిగివెళ్తారు. ప్రతిభ, ప్రఖరత మరియు ప్రామాణికత యొక్క గీటుఱాయి ద్వారా పరీక్షింపబడిన, పూర్తి సమర్పణ చేసుకున్న ప్రతిభల యొక్క సమూహమే ఈ సంస్థ యొక్క మేరుదండము.

గ్రామగ్రామములో నవయుగముయొక్క జ్ఞానజ్యోతిని వెలిగించేందుకు వెళ్ళటానికి నల్గురు పాడగలిగేవారు, ఒక వక్త, ఈ విధంగా ఐదు ఐదుగురు కలసి ఒక మండలిగా ఏర్పడి నిరంతరము కార్యక్షేత్రములో తిరుగుతూవుంటారు. వీరికొరకు వాహన సౌకర్యముకూడా ఉన్నది. సంవత్సరములో సుమారు 15 వందల సమ్మేళనాలు జరుగుతాయి. వీటిలో దీపయజ్ఞములే కాక వార్షికోత్సవాలు కూడా వుంటాయి. వీటికొరకు ప్రజ్ఞాసంస్థాన్ అనే పేరుతో భవనాలుకూడా నిర్మించబడివున్నవి. భారతదేశంలో ఇవి సుమారు 3000 ల కంటే ఎక్కువ ఉన్నవి. మిగతా అనేక స్థానాలలో సక్రియ కార్యకర్తలు నిర్వహించే శాఖలుకూడ వున్నవి. ఈ కార్యక్రమాలలో పాల్గొనుటకు ఒక దక్షిణ ఇవ్వవలసి వుంటుంది. అది ఒక దుష్ప్రవృత్తిని వదిలిపెట్టి, ఒక సత్ప్రవృత్తిని అలవరచుకొనుట. ఈవిధంగా వేలాది లక్షలాది వ్యక్తులు చెడును వదిలి, మంచిని గ్రహించారు.



మిషన్‌తో ప్రభావితమైన వ్యక్తులు రోజుకి కనీసము ఒక గంట సమయము, అర్ధరూపాయి అంశదానము ఇస్తారు. వారి స్థానిక ప్రదేశాలలో సత్ప్రవృత్తి సంవర్ధనముకొరకు, నిరంతరము అంశదానము ఇచ్చే వ్రతము తీసికొనవలసి వుంటుంది. ఎంతోమంది తమ సమయములో సగం కుటుంబానికి-సగం సమాజసేవకి ఇస్తున్నారు. ఈ కోవకుచెందిన వానప్రస్తులను కూడా మిషన్ చాలా పెద్దసంఖ్యలో తయారుచేసింది. ఇందులో యాభైశాతము కంటే ఎక్కువమంది మహిళలు వున్నారు. మహిళా జాగృతి సందేశాన్నిచ్చేవారూ వున్నారు. ఈ ఏర్పాటు వల్ల సమాజంయొక్క ప్రతిక్షేత్రములో వేతనము తీసికోకుండా అనుభవము వున్న కార్యకర్తలు చాలా పెద్ద సంఖ్యలో ఏర్పడతారని ఆశిస్తున్నాము.

ఒకప్పుడు భారతదేశములోని మనీషీలు - లోకసేవకులు సంపూర్ణ విశ్వానికి మార్గదర్శనము చేయటానికి సమర్థులు. ఇంత పెద్ద సంఖ్యలో లోకసేవకులు వానప్రస్థపరంపరద్వారానే తయారయ్యేవారు. తమ బాధ్యతలను తగ్గించుకొని పూర్తి సమయాన్ని లేక కొంత కాలాన్ని వెచ్చించి వారు లోకకళ్యాణ సాధన చేసేవారు. దేవమానవులని తయారుచేసే ఈ పరంపర మఱల జాగృతము అవ్వాలి.

శాంతికుంజ్‌లో ఆర్థిక స్వావలంబన కొరకు కుటీరపరిశ్రమ ప్రశిక్షణకు విశేష వ్యవస్థ వున్నది. దానిద్వారా మహిళలు తాము సంపాదించిన దానితో సంపూర్ణపరివారానికి ఎంత

సహాయపడగలరంటే, కుటుంబములో ఒక వ్యక్తి నిరంతరము సమాజనిర్మాణ కార్యాలలో నిమగ్నమై ఉండవచ్చు. పై పంక్తులలో క్లుప్తంగా అనేకులకు ప్రేరణ ఇచ్చిన విధానములు వివరింపబడినవి.

సంత్ వినోబా ఏమనేవారంటే 'ఏదైనా ఒక సంస్థ విలువ, ప్రజలు దాని క్రియాకలాపాలకు సహయోగము ఇస్తున్నంవతరకు మాత్రమే ఉంటుంది. ప్రజల సహయోగము ఆగిపోయిందంటే అక్కడ లోకసేవకుల భావనల లేక శ్రమశీలతలో ఎక్కడో లోటు వున్నది అని అర్థము.' అటువంటప్పుడు ఆ సంస్థని మూసివేయడమే మంచిది. శాంతికుంజ్ మొదటి నుండి ఈ గీటుఱాయి మీదే నిలబడివున్నది. ఇక్కడ జరుగుతున్న గతివిధులను మూల్యాంకన చేసి ఇటువంటి సంస్థకు ఏదైనా ఇవ్వాలని అనిపిస్తే అడక్కుండానే స్వేచ్ఛగా ఇచ్చిన అనుదానాల ఆధారంగానే ఇంతవరకు శాంతికుంజ్ ప్రగతి సాధించినది. ఇకముందుకూడ ఈ ఆధారంగానే ఇది పెరుగుతుంది.

**చిన్న నమూనా అయినా శాంతికుంజ్ గురించి ఇక్కడ ఎందుకు చెప్తున్నామంటే ప్రతి క్షేత్రములోకి ప్రతిభ కలవారు తాము చేయగలిగే కార్యక్రమాలను నిర్ణయించుకొని యుగసృజన యొక్క ఆవశ్యకతలను పూర్తిచేసి నవసృజన యొక్క ఆధారశిల స్థాపించుటకు మహత్వపూర్ణమైన అడుగులు వెయ్యండి.**

21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 1

మహాపూర్ణాహుతి పుస్తకమాల - 1

**21 వ శతాబ్ది - ఉజ్జ్వల భవిష్యత్తు - 1**

**ప్రథమ భాగము**

ప్రథమ ముద్రణ : 2000 ప్రతులు

2008 - ఉగాది

మూల్యము : 10/-

అక్షరకూర్పు : శ్రీమతి రాజ్యలక్ష్మి, శ్రీమతి లక్ష్మిగోపాల్, శ్రీమతి వల్లీప్రసాద్

డిజైన్ : వై.హెచ్.ఎస్.ప్రసాద్, హైదరాబాద్.

ప్రకాశకులు : హిందీ: **యుగనిర్మాణయోజన, గాయత్రీ తపోభూమి,** మథుర

ముద్రణ మరియు ప్రతులకు :

**గాయత్రి చేతనా కేంద్రము**

అశ్విని హౌస్ దగ్గర, హెచ్.పి.రోడ్, మూసాపేట్, హైదరాబాద్-500018.

ఫోన్స్ : 040-23700722, 32986922, 09392506888

E-mail : hyderabad.ap.in@awgp.org, info@aswini.com

## క్రాంతిధర్మీ సాహిత్యము యొక్క 20 పుస్తకములు

1.ఇరవైఒకటవ శతాబ్ది - ఉజ్వలభవిష్యత్ - 1 (ఇక్కీస్వీసదీ బనామ్ ఉజ్వలభవిష్య్-భాగ్1)

2.ఇరవైఒకటవ శతాబ్ది - ఉజ్వలభవిష్యత్ - 2 (ఇక్కీస్వీసదీ బనామ్ ఉజ్వలభవిష్య్-భాగ్2)

3.యుగేచ్ఛ - ప్రతిభా పరిష్కారము - 1 (యుగ్ కీ మాంగ్ ప్రతిభాపరిష్కార్-భాగ్1)

4.యుగేచ్ఛ - ప్రతిభా పరిష్కారము - 2 (యుగ్ కీ మాంగ్ ప్రతిభాపరిష్కార్-భాగ్2)

5.సత్యయుగ పునరాగమనము (సత్‌యుగ్ కీ వాపసీ)

6.పరివర్తన యొక్క గొప్ప క్షణములు (పరివర్తన్ కే మహాన్ క్షణ్)

7.జీవన సాధన యొక్క స్వర్ణిమసూత్రములు (జీవన్ సాధనాకే స్వర్ణిమ్ సూత్ర్)

8. ప్రతిభల కొరకు మహాకాలుని ఆహ్వానము (మహాకాల్ కా ప్రతిభావోం కా ఆమంత్రణ్)

9. ప్రజ్ఞావతారము యొక్క విస్తారప్రక్రియ (ప్రజ్ఞావతార్ కీ విస్తార్ ప్రక్రియా)

10. నవసృజనము కొరకు మహాకాలుని ఏర్పాట్లు (నవసృజన్ కే నిమిత్త్ మహాకాల్ కీ తైయారీ)

11. నేటి సమస్యలకు రేపటి సమాధానము (సమస్యాయే ఆజ్ కీ సమాధాన్ కల్ కీ)

12. మనఃస్థితి మారితే పరిస్థితులు మారతాయి (మనఃస్థితి బదలే తో పరిస్థితి బదలే)

13. ప్రఖరప్రజ్ఞ - స్రష్ట యొక్క పరమ అనుగ్రహము (స్రష్టా కా పరమ్ ప్రసాద్ ప్రఖర్ ప్రజ్ఞా)

14. ఆద్యశక్తి గాయత్రి యొక్క సమర్ధసాధన (ఆద్యశక్తి గాయత్రీ కీ సమర్ధ్ సాధనా)

15. శిక్షే కాదు విద్య కూడా (శిక్షా హీ నహీ విద్యా భీ)

16. సంజీవనీ విద్య యొక్క విస్తరణ (సంజీవనీ విద్యా కా విస్తార్)

17. భావసంవేదనల గంగోత్రి (భావ్ సంవేదనాఓం కీ గంగోత్రీ)

18. మహిళా జాగృతి అభియానము (మహిలా జాగృతి అభియాన్)

19. జీవన దేవతా సాధన - ఆరాధన (జీవన్ దేవతా కీ సాధనా - ఆరాధనా)

20. సమయదానమే యుగధర్మము (సమయదాన్ హీ యుగ్ ధర్మ్)